# ఉపోద్ఘాతము

భక్తులారా! హిందూముస్లిం మత సమన్వయము కొరకు నేటివరకు అనేక ప్రయత్నములు సాగినప్పటికిని సరియైన పరిణామము కలుగలేదు. ఎందుకనగా "రోగమొక్కటి మందొకటి" యను సామెతగా పరిణమించినది. నేను హిందూముస్లిమ్ సూత్రాల ననుసరించి, ఉభయులకు సంధిచేయునట్టి జగత్‌గురువును సూచించాను. వీరి ద్వారానే మన భారతదేశములో యుండే సర్వమతస్థులు శాంతి సముద్రమగు 'ఇస్లాము' ధర్మస్థానమునకు రాగలుగుదురు. ఇందులో సందేహములేదు. నాకు తెలుగు చెప్పటయందభ్యాసము ఎక్కువగా యున్నది. కాని వ్రాయుట నాకభ్యాసము చాల తక్కువ. ఒక చిన్న బాలుని తెనుగుభాషలో వ్రాసినాను అక్షరములయందు తప్పు లుండ వచ్చునుకాని విషయములు మాత్రము అమృతప్రాయమైనవి. విషయములు తెలుసుకొని, కాలచక్రము ననుసరించి ధర్మకార్యముకొరకు ప్రోత్సాహ మొసంగుదురని ఆసించుచున్నాను.

అల్లాః సర్వేశ్వరుడు సద్ భక్తులందరిని రక్షించుగాక!

ఇట్లు,

గ్రంథకర్త

**MD. ABDUL SATTAR,**

Missinary of Peace.

# హిందూ - ముస్లిమ్ ధార్మిక సమ్మేళనము

## మొదటి భాగము



"అష్హదు-అన్ - లాయిలాహ - ఇల్లల్లాహు - వహదహు - లాషరీక - లహు - వ - అష్హదు - అన్న మొహమ్మదన్ అబ్దుహు- ఒ - రసూలహు"

అర్థమేమనగా:—నేను సాక్షి పలుకేదేమనగా, అల్లా సర్వేశ్వరుడు మినహా, మారెవ్వరు ప్రీతిపాత్రులులేరు. అతడొక్కడే, అతని సాటి ఎవరులేరు. మరియు నేను, సాక్షి పలుకేదేమనగా శ్రీ మొహమ్మదుగారు (అల్లా సర్వేశ్వరునిశాంతి ఆయనపై యుండుగాత) అతని భటుడు, మరియు అతని ప్రసన్నమూర్తియగు ప్రవక్త అమ్మాబాద్ అటుపిమ్మట,

ఫ-అవుజు - బిల్లాహి - మినష్షైతాన్ - నిర్రజీం:—

అనగా అల్లాసన్నిధినుండి బహిష్కరింప బడిన పిశాచమునుండి (షైతాన్) నేను అల్లాః సర్వేశ్వరుని రక్షణ గోరుచున్నాను.

"బిస్మిల్లా - హిర్రహమా - నిర్రహీమ్"

అర్థమేమనగా:-బ్రహ్మ, విష్ణువగు అల్లాఃనామమునతో ప్రారంభమగుగాక !

"అల్హందు - లిల్లాహి - రబ్బిల్ - ఆలమీన్" — అనగా - సర్వలోకములోని వివిధ జనాంగముల మానవులను క్రమేణ పోషించు అల్లాః సర్వేశ్వరునకు సమస్తస్తోత్రములు చెల్లుగాక !

"నహమదుహు - వనుసాల్లై - అలా - రసూలెహిల్ కరీమ్" అనగా:—మేము అల్లాః పరమాత్ముని స్తోత్రము చేయుచున్నాము.

పరమదయాళుడగు అతని ప్రవక్తయైన, శ్రీ మొహమ్మదుగారికి (అతనిపై శాంతి యుండుగాక) తన, మన, ధనములను అర్పించుచున్నాము.

"వమా-అర్‌సల్‌నాక — ఇల్లా - రహమతల్‌లిల్‌ఆలమీన్"
(ప్రణవవేదము సూర. 21, రుకూ. 7)

అనగా:—అల్లాః సర్వేశ్వరుడు తన ప్రియుడైన మొహమ్మద్ గారితో చెప్పుచున్నాడు. ఓయీ! మొహమ్మదు! సర్వజనాంగముల మానవుల కొరకై నిన్నొక్కనినే దయా సముద్రుడుగ పంపినాను.

భక్తులార:—"వస్‌సలాము - అలా - మనిత్తబఅల్‌హుదా"
(సూర, 20, రుకు. 2)

అల్లాః సర్వేశ్వరుని, శాసనాన్ననుసరించి ప్రవర్తించువారిపై శాంతి (సలాము) యుండుగాక!

యదా యదాహి ధర్మశ్యగ్లానిర్‌భవతి భారత!
అభ్యుత్థాన యదర్‌యస్య తదాత్మానాం సృజామ్యహమ్.
(భగవత్‌గీత అ. 4 శ్లో 7).

పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే॥
(భగవత్ గీత అ. 4 శ్లో. 8).

పై రెండు శ్లోకముల ప్రమాణ ప్రకారముగ అల్లాః పరమాత్ముడు, జగత్తులో అధర్మమెక్కువై ధర్మము నశించు నప్పుడెల్ల ధర్మాన్ని స్థాపించుతాడు. అల్లాః సర్వేశ్వరుని కర్తవ్యము ఇదియే యని సర్వమతస్థుల భక్తులెల్లరకును తెలియును.

వైదిక శాస్త్రాల్లో శ్రీ మహావిష్ణువుయొక్క ముఖ్య అవతారములు పది యని సర్వులకును విదితమే ఈ దశ అవతారముల పేర్లు:- మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, భార్గవ, రాఘవ, కృష్ణ, బౌద్ధ, కల్కి..

ఈ దశ అవతార పురుషులమీద సర్వవైదిక భక్తులెల్లరకును సంపూర్ణ విశ్వాసమున్నది. అనాదికాలమునుండి నేటివరకు ఈ విశ్వాసములో కించిత్తయిన సడలిక లేదు. ఈ విశ్వాసముయొక్క ప్రధానము మన వైదిక భక్తులలో మజ్జాగతమై యున్నది. ఏవిధమైన శక్తి ప్రయోగముచేత ఈ విశ్వాసము మార్పుచెందదు. సన్నగిల్లదు. అంతరించి పోజాలదు. ఎందుకన, అల్లా పరమాత్ముడు భారతీయ భక్తుల హృదయాలలో ఈ విశ్వాసాన్ని నాటి, నేటివరకు పోషించుచు, రక్షించుచు వచ్చినాడు. కాబట్టి అల్లా పరమాత్ముడే ధర్మ సంస్థాపనానికి కర్త. మనము అతని సద్భక్తులయి, అతని ధర్మకార్యములో భాగము వహించి, అతనికొరకై పాటుపడవలయును. ఇదియే మన విద్యుక్తధర్మము. ఇదియే మన జీవితాశయముకూడా.

దశావతారపురుషులలో 9వి అవతారపురుషుల జీవితచరిత్రము సర్వసామాన్య మానవులకును, వేద వేదాంగవేద్యులయిన వారికిని, పండితులకును, పండితోత్తములకును తెలియును. అయితే కడపటి దశావతార పురుషుడైన కల్కి అవతార పురుషుని జీవిత విషయములు మాత్రము అందరకును తెలియవు. అందరకును తెలిసిన విషయ మేమనగా:- కల్కి అవతార పురుషుడు వస్తాడు. ధర్మ సంస్థాపన చేస్తాడు అనే విషయము మాత్రము తెలుసు. గాని అతని సంపూర్ణ విషయములు తెలియవు. తెలిసిన బ్రాహ్మణోత్తములు సర్వసామాన్య మానవులకు దశఅవతార పురుషుడైన కల్కి విషయమును తెలుపలేదు. ఇదియొక పొరపాటు. నిజమైన విషయమేమంటే శ్రీమత్, కల్యాణ స్వరూపుడైన కల్కి యవతారపురుషుడు జన్మించి, ధర్మసంస్థాపనముజేసి నేటికి 1375 సం॥ లయినవి. అతని మొదటి రాకడ ముగిసినది. కలియుగ 5,000 సం॥లకు ఆయన రెండవ రాకడ భారత దేశములో ఇపుడున్నది. ఈ కార్యము సాగుచున్నది. ఇంక కొంతకాలములోనే భారతీయులందరు విశ్వసించి అతని అనుయాయులయి ఇతర దేశములలో శాంతిని తప్పక నెలకొల్పుదురు. ఇది త్రికాల సత్యం! సత్యం!! సత్యం!!! గమనింపుడు! గమనింపుడు!! గమనింపుడు!!!

కల్కి-యవతార పురుషుని సంపూర్ణజీవిత చరిత్రము తెలుసుకొనుటకు ముందు ఒక యవతార పురుషుని జీవిత ముఖ్య అంశములను తెలుసుకొనవలయును.

ఒక యవతార పురుషుని జీవిత చరిత్రముయొక్క కొన్ని ముఖ్య ఘట్టములు :—

1.-ఆయన జన్మించే కాలము.

2. ఏ దేశము ? 3. ఏజనాంగము ? 4. ఏ గ్రామము ? 5. తల్లి దండ్రులపేర్లు 6 ఆయన ఓంకారము 7. ఓంకారము తెచ్చే దేవమాత 8. ఆయనఆత్మికవాహనము 9. ఆయన స్థూలశరీర వాహనము 10. ఆయన యుపయోగించే ఆయుధము 11 ఆయన కీయబడిన గ్రంథము 12. ఆయన ముక్తిధాయక మంత్రము 13. ఆయన పుణ్య క్షేత్రము 14. ఆయన శిష్యవర్గము 15. ఆయన సుగుణనిర్గుణ నామ ధేయములు 16. ఆయనస్వర్గారోహణము 17. ఆపురుషుని ధర్మమేమి.

పై నుదహరించిన అంశముల ననుసరించి శ్రీమత్ కల్కి-యవతారపురుషుని జీవితచరిత్రమును పరిశీలింపుము:—

1 ఆయన జన్మించేకాలము:— కలియుగ 3,658 సం॥ లో శ్రీమత్ కళ్యాణస్వరూపుడైన మొహమ్మదుగారు అవతరించి నేటికి 1375 సం॥ లు అయినవి. వైశాఖ మాసములో, శుక్ల పక్షములో, 12వ తేదీన సోమవారమునాడు తెల్లవారు ఝామున జన్మించినారు. (ప్రమాణము:—కల్కి-పురాణము అ. 1. శ్లో 15. భాగవతము స్కంధము 12. అ 2)

2 ఏ దేశము :— శాల్మలద్వీపము దీనిని అరబ్బీదేశమందురు. (ప్రమాణము:-కల్కి-పు. అ. 1. శ్లో. 4. భాగవతము స్కంధము 12.అ 2)

(3) ఏజనాంగము :— మ్లేచ్ఛజనాంగము. అనగా:—అరబ్బుల జనాంగము ఈజనాంగములో శ్రీమత్ కల్కి-యవతార పురుషుడైన మొహమ్మద్ గారు (ఆయనపై శాంతియుండుగాక) జన్మించినారు.

(ప్రమాణము:— కల్కి పురాణము, భాగవతము, భవిష్య పురాణము, భారతములో, అరణ్యపర్వము 4వ అశ్వాసము)

(4) ఏ గ్రామము :- శంభళ గ్రామము ఈ గ్రామమునే అరబ్బీ భాషలో మక్కా పట్టణము.

(ప్రమాణము:—కల్కి, భాగవత, భవిష్య పురాణములు.)

(5) మాతా పితృల నామధేయము లేవి:- మాతపేరు సుమతి దీనిని అరబ్బీలో హజరతా "అమినా" (ఆమెపై శాంతియుండుగాక) పితృని నామధేయము :- విష్ణుభక్తుడు అనగా అరబ్బీభాషలో హజరత్ అబ్దుల్లా (వారిపై శాంతి యుండుగాక.)

(ప్రమాణము:—కల్కి, భాగవత, భవిష్యపురాణము.)

(6) ఆయన ఓంకారము:-సంపూర్ణ ప్రణవము. అనగా "అఖిరి కలామె ఇలాహి"

(కల్కి. భాగవత పురాణములు.)

(7) ఓంకారము తెచ్చే దేవమాత:—దేవేంద్రుడు అనగా దేవతలకు అధిపతి ఇతనినే అరబ్బీలో హజరత్ జిబ్రీల్ (అతనిపై శాంతి యుండుగాక.)

(భాగవతము స్కంధము 12. అ. 2)

(8) ఆయన ఆత్మిక వాహనము:—కామధేనువు. కల్కి వాహనము దీనినే అరబ్బీభాషలో "బుఱ్ఱాఖ్" అందురు. దీని చిత్రము వైదిక శాస్త్రములలో అనేక చోటులలో యున్నది.

(కల్కి. భాగవత పురాణములు.)

(9) ఆయన స్థూల శరీర వాహనము:— అశ్వము, ఒంటె. (కల్కి, భాగవత పురాణములు, ఆగమశాస్త్రములు.)

(10) ఆయన ఆయుధము:-ఖడ్గము. దీనినిఅరబ్బీలో"షంషీర్" అందురు.

(11) ఆయనపై అవతరణమైన గ్రంథము:- బీజ స్వరూపమైన ప్రణవ వేదము. ఇదియే పవిత్రమైన "ఖురానె కరీమ్"

(12) ఆయన ముక్తిదాయక మంత్రము:-ప్రణవ పంచాక్షరీ బీజమంత్రము. ఇదియే "కల్మెతయ్యిబా"

అనగా:—"లాయిలాహా-ఇల్లల్లాహు-మొహమ్మదుర్ రసూలుల్లాహి"

(13) ఆయన పుణ్యక్షేత్రము:-శంభళగ్రామము. మక్కా-మొఅజమా, మదీనామునవ్వర.

(14) ఆయన శిష్యవర్గము:— శాంతిదాయకులు. అరబ్బీలో ముస్లిములు హజరతు, అబూబకర్ సిద్దీక్, హజరత్ ఉమర్, హజరత్ ఉస్మాన్, హజరత్ అలీకరముల్లా వజుహూ(వారిపై అల్లాః ప్రసన్నము యుండుగాక) వీరు ప్రముఖశిష్యులు. శ్రీ గణపతి-వీరినే అరబ్బీ భాషలో హజరత్ అలీ కరముల్లా వజుహు. (వీరిపై ప్రసన్నతయుండుగాక.)

(15) అతని సుగుణ నామధేయములు:—అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయక - అరబ్బీలో "సర్వాలెకాయనాత్" (ఆయనపై శాంతి యుండుగాక.

శ్రీమన్ నారాయణ - అరబ్బీలో "ఆబెహాయాతునబి" (అతనిపై శాంతి యుండుగాక.)

(కల్కి పురాణము అ. 1 శ్లో 2)

పురుషోత్తముడు, నరోత్తముడు.

శ్లో॥ నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమం।
దేవీం సరస్వతీం చైవతధోజయా ముదరేత్॥

(కల్కి పు. అ. 1 శ్లో 2)

పై శ్లోకములో నారాయణుడు నరుడు, నరోత్తముడు అని చెప్పబడినది. గాని దేవుడని చెప్పబడి యుండలేదు. మానవులు సరియైన జ్ఞానములేక నారాయణుడు దేవుడని భావించుచున్నారు.

నరుడు-అరబ్బీలో దీనిని "బషర్" నరోత్తముడు అరబ్బీలో ఈ నారాయణునినే "ఖైరుల్-బషర్" అని వుద్ఘాటించ బడినది.

(ఖురానె కరీం సూర 18. రుకూ. 12.) కాబట్టి నారాయణుడు అంత్యమున వచ్చే ముద్ ప్రవక్త. అతనిని విశ్వసించవలయునని పై శ్లోకములో వేదవ్యాసులు సూచించియున్నారు. అంత్యమున వచ్చిన ప్రవక్తకు అరబ్బీలో "ఖాతమున్నబీన" అని చెప్పబడినది. కాబట్టి శ్రీకళ్యాణ స్వరూపుడైన మొహమ్మద్ (అతనిపై శాంతి యుండునుగాక) అంత్యమున వచ్చిన ప్రవక్త అతడే ముద్ ప్రవక్త. అందువలన అతడు జగత్తులో వచ్చిన పిమ్మట 1,375 సం॥ ల నుండి జగత్తులో ఏ క్రొత్త ప్రవక్తరాలేదనే విషయం జగత్తునకే తెలియును. ప్రణవ వేదములో (పవిత్రమైన ఖురానె కరీం) అల్లాః పరమాత్ముడు తన ప్రియుడైన శ్రీ మొహమ్మదు గారితో (ఆయనపై శాంతి యుండునుగాక) క్రింది విధముగా చెప్పుచున్నాడు.

"ఖుల్-ఇన్నమా-అనా - బషరుం - మిసులుకుం - యూహా-ఇలై యఅన్నమా-ఇలాహుకుం-ఇలాహుం-వాహిద్"

(ప్రణవవేదము : సూర. 18 రుకూ 12,)

అర్థమేమనగా:—ఓ యీ మొహమ్మదా ! సాటింపుచేయుము. "నేను మీరీతిగా నొక నరుడను. నాకు పరమాత్ముడు ఓంకారమనే ఆత్మికజలము. అనగా అమృతమును ఇచ్చినాడు. పరమాత్ముడు సర్వ మానవులకు ఒక్కడే. నన్ను సర్వజనాంగముల మానవులకు అమృతమును, ఓంకార జలమును మీకు ఇచ్చుటకు నన్నొక్కనినే పంపినాడు. కాబట్టి నన్ను విశ్వసించి అమృతము త్రాగి చిరంజీవులు కావలయును.

కల్కిపురాణములో వేదవ్యాసులు సూచించిన ప్రకారముగా శ్రీమన్నారాయణ అంశమును మూర్తిభవించిన శ్రీవిరాట్ మొహమ్మద్ (అతనిపై శాంతియుండునుగాక) సర్వజనాంగముల మానవులకు ఏకైక ప్రవక్తుడైవచ్చి, నేటికి 1,375 సం॥ లయినవి. అయినప్పటికిని భారతీయుల బ్రాహ్మణోత్తములు ఈమహాకల్యాణమూర్తిని గుర్తించక పోయినందుకు మావంటి భక్తులు దుఃఖపడుచున్నారు. అందువలన, శీఘ్రముగా, శ్రీమొహమ్మదుగారిని (అతనిపై శాంతియుండుగాక)

భారతీయ బ్రాహ్మణోత్తములు విశ్వసించి, అతని గ్రంథరాజమైన ఖురాను వేదమును, తన్ను ఆశ్రయించిన ఇతరకులస్తులందరకును, బోధింపవలయునని ఈగ్రంథముద్వారా ప్రార్థించుచున్నాము.

"అనాది నిధినాయనమః"

(శ్రీవిష్ణుశాస్త్రనామావళి పేజి 40)

శ్రీవిష్ణు సహస్రనామావళిలో యుండే నామములన్నియు కూడ శ్రీవిష్ణు అంశములో, అంత్యమున వచ్చిన అవతారపురుషుడైన శ్రీమొహమ్మదుగారి (అయనపై శాంతి యుండుగాక) సుగుణనామ ధేయములే గాని మరి ఏప్రవక్తకు చెందిన నామములుగావు. భాషలు వేరు వేరుగా యుండుటవలన సామాన్యులు దు గ్రహించుటకు కొంత కష్టమైయున్నది. ఇతనిని విశ్వసించిన ముస్లిములు సంస్కృతమును అర్థముచేసికొనజాలక శ్రీమొహమ్మదుగారి (అతనిపై శాంతియుండు గాక) విషయములను శాస్త్రసమ్మతముగా బ్రాహ్మణోత్తములకు తెలియజెప్పుటకు చాల దుర్భరమైనది.

ఇచ్చట "అనాది నిధిన" దీని అర్థమేమనగా, ఈ విశ్వమును సృష్టించుటకు ముందుగా యుండిన "నిధిన" అనగా ధనము దీని ననుసరించి ఒక హదీసు ఇలాగున్నది.

"కుంతు కణజణ-మక్ఫియన్-ఫ అహబబ్ తా - అన్ వుంఫ-ఫఖలఖ్ తో-ఆదమ"

ఇచ్చట "కణజన్" అనగా సరియైన అర్థము "నిధిన" కావున అల్లాః పరమాత్ముడు బీజరూపముగా శ్రీమొహమ్మద్ గారి (అతనిపై శాంతియుండుగాక) జ్యోతిని సృష్టించినాడని హదీసులలోయున్నది. కాబట్టి బ్రాహ్మణోత్తములు "అనాదినిధిన"గా యుండిన శ్రీ మొహమ్మదు (అతనిపై శాంతియుండుగాక) గారిని విశ్వసించుటకు ఏవిధమైన సంశయములులేవు.

"ఓం శివాయనమః"

(శివసహస్ర నామావళి పుట. 86)

ఇచ్చట "శివ" యనగా మంగళకర స్వరూపము. దీనినే అరబ్బీలో "ముబారక్‌నబి" అందురు. శ్రీమొహమ్మద్ గారికి (అతనిపైశాంతియుండుగాక) ముందుగావచ్చిన సర్వ అవతారపురుషుల విగ్రహములున్నవి. విగ్రహములు నశించునట్టివి, అమంగళకరము కూడ అయితే జగదందట శ్రీ మొహమ్మదుగారి (అతనిపై శాంతి యుండుగాక) అనుయాయిలులో పేరి విగ్రహముకాని, ఫోటోగాని కనపడదు. ఎందుకనగా శ్రీమొహమ్మదుగారు (అతనిపై శాంతి యుండుగాక) సాక్షాత్ మంగళస్వరూపులు కాబట్టి శివసహస్రనామావళిలో ప్రతిరోజున పఠించుచున్న "ఓంశివాయనమః"కు సరియైన మంగళస్వరూపుడైనవారు శ్రీ మొహమ్మద్ గారే (ఆయనపై శాంతియుండుగాక) కావున శివభక్తులందరు శ్రీ మొహమ్మదుగారినే విశ్వసించవలయునని మా ప్రార్థన.

"ఓం భాస్కరాయనమః"

(సూర్యనమస్కార గ్రంథము పుట 1. 2)

ఇచ్చట "సూర్యనమస్కారాయానమః అనగా సర్వదేశములలో యుండే మానవుల హృత్ కమలములను విరాజింపజేసె ఆత్మిక సూర్యుడని యర్థము. దీని ననుసరించి ప్రణవవేదములో అల్లాః సర్వేశ్వరుడు మొహమ్మదుగారితోఁ (అతనిపై శాంతియుండుగాక) ఈలాగు చెప్పుచున్నాడు.

"యా అయ్యుహన్-నబీయు-ఇన్నా-అర్
సల్‌నాక-షాహిదౌఁ-వముబష్షరా
నజీరాఁ-వదాయియన్-ఇలల్లాహి-బి
జినిహి-వశిరాజం-మునీరా"

(ప్రణవవేదము సూ రా 33 రుకు 6)

పై ఆయత్తులో, అల్లా సర్వేశ్వరుడు, ఈవిధముగా చెప్పుచున్నాడు. ఓయి నా ప్రియుడగు మొహమ్మదా ! నేను ప్రకాశమానమైన సూర్యుడుగా సర్వదేశముల మానవులకొరకు నిన్ను పంపినాను.

కాబట్టి భారతీయ సూర్యనమస్కారము చేయుభక్తులందరు, జడ సూర్యుని వదలి, ఆత్మికసూర్యుడైన శ్రీ మొహమ్మద్ గారిని (అతనిపై శాంతియుండుగాక) ఏసంశయము లేకుండ విశ్వసించి జన్మసార్థకము చేసుకోవలయునని మా ప్రార్థన.

"ఓం భూః, ఓం భువః, ఓం స్వః, ఓం మహః, ఓం జనః ఓం తపః ఓం సత్యం ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్యధీమహి, ధియోయోనః ప్రచోదయాత్."

పై సంధ్యావందనములో కనపరచిన, ఏడులోకముల కంతటకు వెలతరింపజేసే - భర్గోదేవస్య - అనగా దేవునియొక్క తేజస్సును మేము ధ్యానించుచున్నాము అని అర్థము.

కాబట్టి పై కనపరచిన అల్లాః పరమాత్మునియొక్క తేజస్వరూపుడైన శ్రీ మొహమ్మద్ గారిని (ఆయనపై శాంతి యుండుగాక) విశ్వసించవలయునని మాభక్తుల ప్రార్థన. శ్రీ మొహమ్మదుగారి (అతనిపై శాంతి యుండుగాక) హదీసుకూడ దీని ననుసరించి యీలాగున్నది.

"అనామిన్ నూరిల్లాహి-వకల్లు-షయ్యిన్-మినూ్నరి" అర్థమేమనగా - అల్లా పరమాత్ముడు. నా తేజస్సును మొట్టమొదట సృజించినాడు. నా తేజస్సునుండి చరాచర సర్వవస్తువులుకూడ సృష్టింపబడినవి.

కాబట్టి ఈ ప్రమాణము ననుసరించి విశ్వసించిన వారందరు ఇహపరలో సుఖ సామ్రాజ్యాన్ని అనుభవింతురు.

శాంతాకారం భుజగశయనం పద్మనాభం।
సురేశం విశ్వాకారం గగన సదృశం।
మేఘవర్ణం శుభాంగం లక్ష్మీకాంతం।
కమల నయనం యోగి హృద్ధ్యాన గమ్యం।
వందే విష్ణుం భవభయహారం సర్వలోకైకనాథం॥

పై శ్లోకములో యుండే సర్వసుగుణాలను మూర్తీభవించిన వారు శ్రీ చిన్మయ స్వరూపుడైన మొహమ్మద్ గారు మినహా, మరె వ్వరు కాజాలరు. ఎట్లనగా, ఇచ్చట సర్వలోకైకనాథం అనే సరియైన అర్థాన్ననుసరించి, అల్లాః పరమాత్ముడు కురాను వేదములో మొహమ్మద్ గారిని (అతనిపై శాంతియుండునుగాక) సంబోధించుచు, సర్వలోకాల మానవులకు ప్రకటన చేసినదేమనగా.

"ఖుల్ - యా అయ్యుహన్నాస్ - ఇన్నిరసూలుల్లాహి - ఇలైకుం - జమీాయా - నిల్లజీ - లహుముల్కుస్సమావాతి - వల్ అర్జ్"

"ప్రణవవేదము సూర 7. రుకు 19" అర్థమేమనగా ఓయీా మహమ్మదా! నీవు మానవులకు సాటింపుచేయుము. నేను పరమాత్ముని సర్వదేశాలలోని మీా అందరి మానవుల కొరకై ఏకైక ప్రవక్తుడనై వచ్చినాను. నన్నువిశ్వసించినచో మీారుజీవచైతన్యపదవినిపొందుదురు లేనిచో మీారు జీవ చైతన్య హీనులగుదురు.

పై ప్రమాణము ననుసరించి శ్రీ మొహమ్మద్ గారు (అతనిపై శాంతియుండునుగాక సర్వజనాంగముల మానవుల యుద్ధారణ కొరకు అల్లాః సర్వేశ్వరుడే పలుకుచున్నప్పుడు సద్భక్తులందరు ఇతనిని విశ్వసించి సుఖింతురు.

కాబట్టి ఈ శ్లోకాన్ని పఠించువారు శ్రీ మొహమ్మద్ గారిని (అతనిపై శాంతియుండునుగాక) విశ్వసించి కృతకృత్యులు కావలయునని మా మనఃపూర్వకమైన ప్రార్థన.

వందే శంభుముమాపతిం సురగురుం వందే జగత్కారణం ।
వందేపన్నగ భూషణం మృగధరం వందేపశూనాంపతిం ।
వందేసూర్యశశాంక వహ్నినయనం వందేముకుందప్రియం ।
వందే భక్తజనాశ్రయంచ వరదం వందే శివంశంకరం ॥

(శివసహస్రనామావళి స్తోత్రం పేజీ 1)

పై శ్లోకములో కనపడిన సుగుణాల్ని మూర్తీభవించినవారు శ్రీ మొహమ్మదుగారే అని గ్రహించాలి. ఈశ్లోకములో ఒక అంశాన్ని తికాణ్యానికి వర్ణించుచున్నారు.

“సురగురుం” దివిజ్యమేననగా ప్రవక్తలందరికి కూడ గురువుగా అల్లా పరమాత్ముడు శ్రీ మొహమ్మదుగారినే (అతనిపై శాంతి యుండునుగాక) పంపినాడు. ఈవిషయమును సరిగ అర్థముచేసుకోవలయును. “సుర” అను పదమునకు దేవతలనియు “గురు” అనగా గురువనియు అర్థం “సుర” అర్థము ఈవిధముగా కార్యరూపములో తెలుసుకోవలయును. త్రేతాయుగమున శ్రీ కోదండరాముని, ద్వేషించి ఎదిరించినవాడు అసురుడైన రావణుడైనాడు. ద్వాపరమున శ్రీకృష్ణుని ద్వేషించి విరోధించినవారు. కంసాసురుడు, కౌరవాసురులు ఈఇద్దరు ప్రవక్తల, నిజాంశమును తెలుసుకొనజాలక తిరస్కరించారు. కాబట్టి రావణుడు, కంసుడు, కౌరవులు, అసురులైనారు. (అనగా కాఫరులైనారు) దేవతల రూపములో శ్రీ కోదండరాములు, శ్రీ కృష్ణులు, సురులైనారు. ఈవిధముగా సురులనగా ప్రవక్తలు. ప్రవక్తలను అరబ్బీలో 'రసూల్' అనబడును. ప్రవక్తలందరకు కూడ గురువుగా శ్రీమొహమ్మదుగారు (అతనిపై శాంతియుండునుగాక) ఒక్కరే. అంత్యమున వచ్చి, నేను సర్వప్రవక్తలకును గురువుగా వచ్చినాను అని సాటించారు. ఈవిషయములను అరబ్బీలో “సయ్యదుల్-ముర్సలీన్” అనబడును. ఈ సంస్కృతపదముల అర్థము అరబ్బీపదముల అర్థము ఒకటిగానే యున్నవి. భాషలు వేరువేరుగా యుండుటచేత వృథయులు తెలుసుకొనజాలక పోయినారు. తమ అందరకునుకూడ గురువుగా శ్రీ మహమ్మద్ గారు (అతనిపై శాంతి వుండుగాక) ఒక్కరేవచ్చారు. యీవిషయమును తెలిసికొనక భేదభావములతో ప్రవర్తించుటకు కారణమైనది. యిచ్చట “సయ్యదుల్-మురసలీన్” అనగా ప్రవక్తలందరకు అధిపతియని అర్థము. ఇంకొక అదీసులో “ఖాయదుల్-మురసలీన్” అనగా ప్రవక్తలకు మార్గము చూపెట్టువాడు. నేత నాయకుడనియు, గురువనియు అర్థము. ఇట్లే అసురులనగా కాఫరులు అనియు, సురులనగా రసూల్ అని నిజ అర్థము.

కాబట్టి, భాషాభిమానమును వదలి, తమ కొరకు పంపబడిన శ్రీ మొహమ్మదుగారు (అతనిపై శాంతియుండుగాక) గురువులకు గురువుగా వచ్చినారను విషయము తెలుసుకొని శివభక్తులందరు విశ్వసించి, భారతదేశమును స్వర్గసీమగా చేయుదురని నమ్ముచున్నాము.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం।
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వ విఘ్నోప శాంతయే।
(శ్రీ విష్ణు సహస్ర నామావళి స్తోత్రం పేజ్ 1)

పై శ్లోకములో యుండే గుణాల్ని మూర్తీభవించిన శ్రీ మొహమ్మద్ (ఆయనపై శాంతియుండుగాక) గారిని తప్పక విశ్వసింతురని పరమాత్ముని అభీష్టము. పై శ్లోకములో యుండే సుగుణాల్లో ఒకటి మాత్రం వివరించుచున్నాను.

"సర్వ విఘ్నోప శాంతయే"

సర్వవిఘ్నాల్ని పోగొట్టువాడు విష్ణువే అయినప్పుడు, ఈ అంశాన్ని కార్యరూపమున చూపెట్టిన ప్రవక్త శ్రీ మొహమ్మదు గారు (ఆయనపై శాంతియుండుగాక) మినహా మరెవ్వరు కారు. ఎట్లన ఖొరానువేదములో ఈ రీతిగా పరమాత్ముడు మానవులకు హెచ్చరించాడు.

"ఖుల్ -ఇన్_కున్ తుం-తుహిబ్బూనల్లాహి ఫత్ -తబె-వూని-యుహిబ్బకుముల్లాః _యక్ ఫిక్ లకుం - జునూబకుం _ వల్ లాహు గఫూరున్_రహీం.

(ప్రణవవేదం సూర రుకు)

ఈ వాక్యములలో అల్లాః లోకోద్ధారకుడు, తన ప్రియుడైన శ్రీ మొహమ్మదుగారితో (అతనిపై శాంతియుండుగాక.)

ఈ క్రింది విధముగా ఆజ్ఞయిచ్చుచున్నాడు.

ఓయి మొహమ్మదు! మానవులందరికి సాటింపుచేయుము. మీరు పరమాత్ముని ప్రీతిని పొందవలయునన్న, నన్ను విశ్వసించి, నన్ననుసరించవలయును. అప్పుడు పరమాత్ముడు మీ పాపములను

హరించి స్వర్గతి ప్రసాదిస్తాడు. పరమాత్ముడు మిక్కిలి దయాళువు. పాపములను పోగొట్టువాడు. ఇంకొక హదీసులో ఈ లాగునయున్నది.

"వమన్ - కాల - లాఇలాహ-ఇల్ లల్లాహు- మొహమ్మదుర్- రసూలుల్లాహి-దఖలల్ జన్నా."

అర్థమేమనగా:- శ్రీ మొహమ్మదుగారు (అతనిపై శాంతియుండుగాక) సెలవిచ్చిన దేమనగా, నాముక్తమంత్రమైన, "లాఇలాహ. ఇల్ లల్లాహు - మొహమ్మదుర్ - రసూలుల్లాహి" ఏవ్యక్తి త్రికరణ శుద్ధిగా పఠించి దన్ననుసరించునో అట్టివాని పాపములు హరించి పోవును. స్వర్గమునుకూడ చేరును.

పై రెండు ప్రమాణములనుండి "సర్వ విఘ్నోపశాంతయే" అనే సుగుణ ప్రభావమును మూర్తీభవించినవారు శ్రీ మొహమ్మద్ గారనే విషయం ఇప్పటికైనను తెలుసుకొని సుఖింతురని ఆశించుచున్నాము.

"అహ మది పితుః పరిమేధా మతస్య జాగ్రభ అహం సుర్యో ఇవాజని."

"సామవేదము ప్రతిసర్గమును, అ, 6. మంత్రం. 8"

ఈ మంత్రములో అంత్యమున వచ్చిన శ్రీకల్కి యవతార పురుషుడైన అహమదుగారి పేరనుగూడ స్పష్టముగా సూచించారు.

కాబట్టి సామవేద ప్రమాణ ప్రకారముగా అంత్యమున వచ్చిన అహమదు పేరుగల ప్రవక్తను విశ్వసించి పరమాత్ముని ప్రీతి పాత్రులగుదురని ఆశించుచున్నాము.

కల్కి పురుషుడైన శ్రీ మొహమ్మదుగారి పేర్లనుగూడ అనగా అహమదు, మొహమ్మదు అని వేదాలలో ఉపనిషత్తులలో అనేక స్థలములందు సూచించబడినవి.

ఈ ప్రమాణములను చూడుడు.

(అథర్వణవేదము ఖాండము 20. సూక్తము 127 మంత్రము 1,7,11.)

శ్రీ కోదండరాములు తన ప్రియశిష్యుడైన హనుమంతునకు ప్రవక్తల అంత్యములో వచ్చిన జ్యోతిస్వరూపుడైన శ్రీ అహమదు

గారి (అతనిపై శాంతియుండుగాక) పేరునుగూడ ఈ క్రింది శ్లోకములో స్పష్టముగా కనపరిచినారు.

ప్రథమంతారకం చైవ । ద్వితియం దండముచ్యతే । కృతియం కుండలాకారం । చతుర్థం అర్థచంద్రికం । పంచమం బిందుసమ్యుక్తం। ఏం జ్యోతిర్జ్యోతిరూపకం ॥

"శ్రీ సీతారామాంజనేయ సంవాద గ్రంథము"

జ్యోతి అనగా అరబ్బీలో "నూర్" జ్యోతిరూప నామకమైన అహమదు బీజాక్షరములను పైశ్లోకములో ఒక్కొక్క యక్షరమగు రూపురేఖల స్వరూపాన్ని వర్ణించినారు. దీనిని చక్కగా వర్ణించి చూడగా అరబ్బీ అక్షరాల్లో అహమదు పేరు స్పష్టమగును.

కాబట్టి శ్రీరాములు సూచించిన జ్యోతిస్వరూపుడైన శ్రీ అహమదుగారిని శ్రీరామ భక్తులందరు విశ్వసించి శ్రీరామవాక్యాన్ని పరిపాలించాలి.

శ్లో॥ ఓంకారం బిందుసంయుక్తం ।
నిత్యం ధ్యాయంతి యోగినః ।
కామదం మోక్షదంచైవ ।
ఓంకారాయనమోనమః ॥

(ఉపనిషత్తువాక్యం)

పై శ్లోకములో వర్ణించినట్లయిన ఓంకారస్వరూపుడైన శ్రీ అహమ్మద్ పేరు (అతనిపై శాంతియుండుగాక) అగుచున్నది. ఇందులో "ఓంకారాయనమోనమః" అనగా సంపూర్తి ప్రణవమును గలిగిన (అరబ్బీలో కలామేఇలాహి) ప్రవక్తకు విశ్వసించి, అతనిని సంతోషపెట్టుదురని కార్యరూపమైన అర్థము, కాబట్టి మొహమ్మదుగారికే అల్లా సర్వేశ్వరుడు సంపూర్ణ ప్రణవస్వరూపమైన ఖురానెకరీమును ప్రసాదించియున్నాడు. పవిత్రమైన ఖురాను వేదమే పరమాత్ముని అంత్యసందేశము. కాబట్టి మొహమ్మదుగారిని విశ్వసించి నేటిరోజున

ఏర్పడిన కులమత వర్గ అభిమానములను మాకీకరించి భారతదేశమును వృద్ధిరించుమని మావంటి భక్తులయభీష్టము.

గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ః గురుర్దేవో మహేశ్వరః।
గురుస్సాక్షాత్పర బ్రహ్మ । తస్మై శ్రీగురువేనమః।

"గురుబోధ గ్రంథం"

పై శ్లోకములోయుండే గురువు లక్షణములన్నియు మూర్తీభ వించినవారు శ్రీ మొహమ్మదుగారే (అతనిపై శాంతియుండుగాక) బ్రహ్మతత్వము ననుసరించి పరమాత్మునిలో ఐక్యమై ప్రణవవేద సంపూర్ణజ్ఞానమును తన భక్తులకు ప్రబోధించినారు. విష్ణుతత్వ మును మూర్తీభవించి, కులతత్వాల్ని దూరీకరించి సర్వవర్ణస్థు లంద రని తమ శిష్యవర్గమునందు జేర్చుకొని మానవుల సమానత్వమును ఏర్పరచి వృద్ధిరించినారు. మహేశ్వర తత్వమును మూర్తీభవించి, ధర్మ విద్వేషునందరిని యుద్ధములలో సంహరించి ధర్మాన్ని, తమశిష్యుల్ని సంరక్షించినారు. ఇట్టిమహత్వరమైన గురుతత్వాన్ని మూర్తీభవించిన వారు మరెవ్వరునులేరు. సాక్షాత్కరించిన గురువే ప్రత్యక్షదైవము. అట్టివారినే నేనుసమస్కరింతుననే అర్థము. శ్రీ జగత్ గురువైన మహమ్మదుగారిని విశ్వసించి జన్మపావనమును చేసుకోవలెయును.

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం ।
ద్వంద్వాతీతం గగనసదృశం తత్వమస్యాదిలక్ష్యం ।
ఏకం నిత్యం విమలవచనం సర్వాది సాక్షిభూతం ।
భావాతీతం త్రిగుణరహితం సద్గురు తన్నమామి ॥

"గురుబోధ గ్రంథము" పై శ్లోకము గురుతత్వాన్ని నిరూ పించుచున్నది. ఇందులో "ద్వంద్వాతీతం" అనగా జగత్తునకు గురువు ఒక్కడే యని అర్థము. ఏ రీతిగా ఈలోకాన్ని ఒకే సూర్యుడు సర్వ చరాచర జీవములందరకును అవసరమైన వెలుగునిస్తున్నాడో, తద్రీతి గానే, సర్వలోక మానవులకు అవసరమైనంత ఆత్మీక వెలుగును ప్రకాశింపజేయు గురువు శ్రీ జగద్గురువయిన మొహమ్మదుగారు ఒక్కరే.

కాబట్టి సర్వదైవీక ప్రమాణములచేత పంపబడిన శ్రీ మొహమ్మదుగారిని (అతనిపై శాంతియుండుగాక) విశ్వసించి సద్గతిని పొంద వలయునని ప్రార్థించుచున్నాము.

సర్వవ్యాపిజగన్నాథః శంఖుచక్రగదాధరః
అనాది నిధనోదేవః ప్రీయతాం పురుషోత్తమః॥

"బ్రహ్మపురాణము పేజీ 112"

పై శ్లోకములో యుండే సద్గుణములన్నియు శ్రీ మొహమ్మద్ వ్యక్తిత్వానికే చెందినవి. ఇందు సూచించబడిన అంశాలలో నొకటిని విశదపరచుచున్నాము.

"శంఖుచక్రగదాధరః" ఈ మూడు శబ్దాల ననుసరించి అరబ్బీ భాషలో సూచింపబడినది. 'శంఖు':-అర్థమేమనగా సాటింపుచేయుట దీనిని ఖురానువేదములో అల్లాః పరమాత్ముడు శ్రీ మొహమ్మదుగారిని సంబోధించి ఓయీ మొహమ్మదూ! "కుల్‌హుఅల్లాహుఅహద్" ఇచ్చట "ఖుల్" అనగా సాటింపుచేయుమని అర్థము. "చక్రము":— అనగా సుదర్శన చక్రము సుదర్శనమనగా పరమాత్ముని సాక్షాత్కరించి, సాక్షిపలుకుట యని యర్థము. దీని ననుసరించిన అరబ్బీలో "కల్మెషహాదత్" అందురు. "షహాదత్తు" అనగాసాక్షి పలుకుటమని యర్థము. శ్రీ మొహమ్మదుగారు (అతనిపై శాంతియుండుగాక) మానవుడై, పరమాత్ముని యొక్క సాక్షి పలికినారు. "గదాధర" అనగా తన కీయబడిన "ఖురాను" వేదశాసనాలను వుల్లఘించువారికి శిక్షించే దండమని అర్థము. కాబట్టి గదాధరుడు శ్రీ మొహమ్మదుగారు శంఖు, చక్ర, గదాధర, శ్రీమన్నారాయణ అంశాన్ని మూర్తీభవించి ఈ మూడుగుణాల్ని తన జీవితములో జగత్తుకు ప్రదర్శించినారు. ఇట్టి సుగుణ సంపన్నుడైన శ్రీ మోహమ్మదుగారినే విశ్వసించి, దైవవిధేయులగుదురని మా ప్రార్థన.

బ్రహ్మకృత శివసహస్ర నామసు।
మృత్యుంజయః సూక్ష్మ తనుర్జగది జగత్ వ్యాపి జగద్గురుః॥
(భవిష్య పురాణము)

పై శ్లోకములో సద్గుణములన్నీ శ్రీ మొహమ్మదుగారి (అతనిపై శాంతియుండుగాక) సుగుణత్వములో మూర్తీభవించి యున్నవి. అల్లాః పరమాత్మునకు ఎన్ని సుగుణ నామాలున్నవో, అన్ని సుగుణ నామములు శ్రీ మొహమ్మదుగారికి యున్నవి. అరబ్బీభాషలో 99 అల్లాః కె నామ్ హైఁయల్ అవతారసూలుల్లాః కె 99 నామ్ హైఁ'' అందురు.

''సూక్ష్మతనుర్ జగది జగత్ వ్యాపి జగద్గురుః'' దీనిని అరబ్బీలో ''సర్వరే కాయినాత్''అందరు. 'జగద్గురుః' దీనిని అరబ్బీలో ''ర్సవర్ ఆలం''-''సర్వరే ఆలం'' (అతనిపై శాంతియుండుగాక) అందురు. ఈ అరబ్బీ సంస్కృత పదముల సరియైన అర్థము వెల్లడించాము. వెనుదీయక వీరిని విశ్వసించి సుఖపడవలెను.

''యద్దోర్ దండకరాళ సర్పకవళజ్వాల జ్వాలత్ విగ్రహానేతుః సత్కారవాళి దండదళిత భూపాః క్షితిక్షోభికాః :

శశ్వత్ సైంధవ వాహనో ద్విజజనిః
కల్కిః పరాత్మహారిః పాయత్ సుత్యుగాది
కృత్ స భగవాన్ ధర్మప్రవృత్తిప్రియః॥

(కల్కి పురాణము అ. 1. శ్లోకము 3)

పై శ్లోకములో యుండే సుగుణాలలో నొక్కదానిని మాత్రం విశదీకరిస్తున్నాను ''కల్కిః'' అనగా మాయను, అంధకారాన్ని, అనిష్టమైన విగ్రహ పూజాన్ని దూరీకరించు ప్రవక్తడని యర్థము. 124,000 ప్రవక్తలో శ్రీ మొహమ్మద్‌గారొక్కరే (అతనిపై శాంతి యుండుగాక) మానవుని మాయను, అంధకారాన్ని, విగ్రహపూజల్ని పోగొట్టినాడను విషయం జగత్ ప్రసిద్ధియైనది. కల్కియను శబ్దమును అరబ్బీలో ''మాహియల్ బుత్లాన్'' అని అందురు. అరబ్బీసంస్కృతభాషలను తెలిసినవారు చక్కగా అర్థము విడదీయ గలరు. ఇట్టి అనిష్టమైన విగ్రహ పూజల్ని పోగొట్టు వారైన కల్కిపురుషుడైన

శ్రీ మొహమ్మద్ (అతనిపై శాంతియుండుగాక) గారిని విశ్వసించి, అత్యప్రదాంతములను పొందుదురని కోరుచున్నాము.

పూర్ణజ్యోతిర్ మయఃసాక్షీ పరమాత్మపురాతనః।
వఘాసూర్యసహస్రాణాం తేజోరాసి సమద్యుతిః॥
(కల్కి-పురాణము అ. 19 శ్లో. 22)

ఇందులో "సూర్యసహస్రాణాం" అనగా వేయిసూర్యుల ప్రకాశముగలవాడు కల్కి పురుషుడని యర్థము. ఇట్టి మహత్తరమైన తేజస్సుగల సూర్యనారాయణుండైన శ్రీ మొహమ్మద్ గారిని (ఆయన పై శాంతియుండుగాక) విశ్వసించి ధర్మాన్ని వృద్ధిరించుదురని మా ఆశయము.

16. అవతార పురుషుని యొక్క ప్రార్థన విధానం.

కల్కి పురుషుని భగవత్ ప్రార్థన విధానమేది?

కల్కి పురుషుడైన శ్రీ మొహమ్మద్ గారు, సర్వజనాంగముల వివిధ వర్ణస్తు లందరకును, భగవత్ ప్రోక్తమైన దైవీకశాస్త్రములకు సమ్మతముగాను స్థాపించినారు. ఇదియే సర్వజనకమైన ప్రార్థన విధానము వేరొకటికాదు. దీనినే అరబ్బీలో "సాలాత్-నమాజ్" అందురు.

17. అవతార పురుషుని స్వర్గారోహణము:-కల్కిపురుషుని స్వర్గారోహణమేది? శ్రీమత్ అచల పరిపూర్ణ బ్రహ్మస్వరూపుడైన మొహమ్మద్ గారు (అతనిపై శాంతియుండుగాక) తన దేవదూతమైన దేవేంద్రుని (అనగా హజరత్ జిబ్రీజ్) వెంటపెట్టుకొని, కామధేనువు (అనగా బుర్రాఖ్) పైసవారై, భూలోకముండి ఏడులోకాలు పైవరకు ఆరోహించారు. 1,24,000 ప్రవక్తులందరకును, తానునేతుడై (అరబ్బీలో పేష్-ఇమామ్) భగవత్ ప్రార్థన చేయించినారు. ఏడులోకాలుపై యుండిన సంగమస్థలములో (అరబ్బీలో వహాదతుల్-వజూద్) బుర్రాకును, జిబ్రీలును అచట వదలి, నవరత్నఖచితమైన సింహాసనమును ఎక్కి (అనగా అరబ్బీలో రఫ్-రఫ్) "అర్షెమొ అల్లాః" అనగా పరమాత్ముని సన్నిధి చేరినారు. దీనికి సంబంధించిన విషయ

ములు తెలుపుటకు పుస్తకము పెద్దదగునని అభిప్రాయపడినందున వదలినాము. ఈ స్వర్గారోహణము మానవబుద్ధి గ్రహించుటకు అతీతమైన అవధిలో సంచరించివచ్చినారు. అనే విషయము జగత్తుకు తెలిసినదే. ఇంతటి స్వర్గారోహణము ఏ ప్రవక్తకును ప్రాప్తికాలేదు. ఇట్టి మహిమాన్వితముగల గురువును విశ్వసించి ధర్మముయొక్క పేరు ప్రతిష్ఠలను నిలుపబెట్టుదురని మనఃపూర్వకముగా ప్రార్థించుచున్నాము.

(18) కల్కిపురుషుని ధర్మనామధేయమేమి?

శ్రీమత్ కల్కిపురుషుడైన మొహమ్మదుగారికి ఈయబడిన ధర్మము శాంతిధర్మము. అరబ్బీలో "ఇస్లామ్" అందురు. ఇంగ్లీషులో పీస్ అందురు. ఇట్టిధర్మము కల్కిమూర్తిద్వారా రాబోవుచున్నదని సర్వమతములయొక్క గ్రంథములు ఘోషించుచున్నవి. సర్వప్రవక్తలుకూడ ఈ శాంతిధర్మము రానున్నదని చక్కగా వారివారి కాలములలో సూచించినారు. ఈ శాంతిధర్మము మరిఏప్రవక్తకును ప్రాప్తించలేదని వారివారి గ్రంథముల ద్వారా గ్రహించవచ్చును. అల్లాః పరమాత్మను "ఖురాను"లో తెలిపియున్నాడు.

"ఇన్నద్దీన ఇందల్లాహిల్ ఇస్‌లామ్"

(ప్రణవవేదము—సూర 2 రుకు)

దీనికర్థమేమన నానాన్ని ధర్మములో శాంతిధర్మమున్నది. అనగా "ఇస్‌లామ్" మరియొకచోట పరమాత్మను అనాదిగా పోషింపబడుచూ వచ్చిన "ఇస్లామ్" మొహమ్మద్‌గారి ప్రవక్తత్వములో పూర్తిచేసినానని పలికియున్నాడు. ఇట్టి సర్వోత్కృష్టమైన శాంతిధర్మాన్ని అనగా "ఇస్‌లామ్"ను పండితులు మొదలగువారు స్వీకరించి జగదంతటిలో శాంతి నెలకొల్పుదురని మాభక్తుల ప్రార్థన.

(19) కల్కిపురుషుని మోక్షమంత్రమేది? ప్రతిఒక ప్రవక్తకు ఒకమంత్ర మీయబడినది.

1 ఆదమ్‌నకు-లాయిలాహఇల్లల్లాహు ఆదంసఫీవుల్లా అని
2 ఇబ్రహీమ్-లాయిలాహఇల్లల్లాహు ఇబ్రాహింసఫీవుల్లా

3 క్రైస్తవ ప్రవక్తకు - లాయిలాహాయిల్లల్లాహు_ఈసారూహుల్లా యనియు

4 శ్రీకోదండరాములకు-నమోనమో శ్రీకోదండరామాయాయనియు

5 శ్రీకృష్ణునకు - నమోనమో శ్రీ కృష్ణాయాయనియు

6 శ్రీ గౌతమబుద్ధునకు -నమోనమో శ్రీబుద్ధాయయనియు

7 శ్రీ వర్ధమానమహావీర్_నమోనమో శ్రీవర్ధమానమహావీరాయ

8 శ్రీనరశింహునకు_నమోనమో శ్రీనరశింహాయయని

9 శ్రీనంజుండేశ్వరునకు-నమోనమో శ్రీనంజుండేశ్వరాయయని

10 శ్రీవీరభద్రునకు-నమోనమో శ్రీవీరభద్రాయా యనియు

ఇటులనే శ్రీ కల్కియవతార పురుషుడైన (అతనిపై శాంతియుండు గాక!) శ్రీ మొహమ్మద్‌గారి యొక్క ముక్తిమంత్రము.

"లాయిలాహా_ఇల్లల్లాహు- మొహమ్మదుర్ -రసులుల్లాహి"

ఇది ఏ కలియుగ మంత్రము - ఇదియే ఆది అనాదిమంత్రము- శ్రీజగదాంబ మంత్రము - మూలబీజమంత్రము-జ్యోతిర్మయ లింగ మంత్రము_అండపిండ బ్రహ్మాండమంతట నిండియున్న మంత్రం—— శ్రీ ఆదినారాయణ, సత్యనారాయణ, సూర్యనారాయణ మంత్రం- అజప మంత్రం_పంచ పరమేష్ఠి దర్శన మంత్రం_త్రిజగదనుపమంత్రం_ సర్వపాపహారి మంత్రం_సంసారోచ్ఛేద మంత్రం-విషమ - విషహార కర్మనిర్మూల మంత్రం- కేవల సుజ్ఞానమంత్రం_జన్మనిర్వాణ మంత్రం_ పంచాక్షరీ పరమజ్యోతి మంత్రం_అఖిలాండకోటి బ్రహ్మాండ నాయక అఖండ మంత్రం_సర్వఐశ్వర్యము ప్రసాదించే తారకమంత్రం_మూల విరాటుని పరంజ్యోతిమంత్రం_గాయత్రి మంత్రం_జగత్ గురుమంత్రం_ శ్రీమత్ కల్యాణకల్కి మంత్రం_మహావాక్యం_మహామంత్రం_ఏకో ఈశ్వరోపాసన మంత్రం - స్వర్గద్వారముపై లిఖితమైనమంత్రం - జగత్ శాంతి మంత్రం.

## గాయత్రి మంత్రం

గాయత్రి మంత్రం:_అనగా మూడు స్వరములతో యుండిన మంత్రమని యర్థము. మూలస్వరములు 'అ'కారము 'ఇ'కారము,

'ఉ' కారము ఇవియే సర్వభాషలకు మూలాధారమైన స్వరములు, కాబట్టి భాషల అక్షరములు:—అ ఆ, ఇ ఈ, ఉ ఊ, ఈ స్వరములు లేక ఏ భాషకూడ లేదు. మూల మంత్రమయిన, "లాయిలాహ-ఇల్ల ల్లాహు మొహమ్మదుర్ రసూలుల్లాహి" ఇందులో 'హ' అక్షరము మీద 'అ'కారమున్నది. 'హు' అక్షరముమీద 'ఉ'కారమున్నది. 'హి' అక్షరము మీద 'ఇ'కారమున్నది. ఈ మూడు అక్షముల పరస్పర సంయోగముచేత ఇతర స్వరములు ఏర్పడును. 'అ'కార జబర్ 'ఇ'కారము (జేర్) 'ఉ'కారము (పేష్) ఈమూడు స్వరముల చేత బీజస్వరూపమైన ప్రణవవేదము అనగా "ఖురాన్" వేదము ఏర్పడినది.

కాబట్టి మూలమంత్రమైన "లాయిలాహ-ఇల్లల్లాహు-మొహ మ్మదుర్ రసూలుల్లాహి"లో గాయత్రిలో సూచింపబడిన మంత్ర మిదియే. వేదవుపనిషత్తులలో కూడ ఈ మంత్రము సూచింపబడినది. సామవేదములో హాహా-హూహూ-హిహి-ఈ రీతిగాకూడ సూచింప బడి యున్నది. బ్రాహ్మణులు అవసానకాలములో-హాహా-హూహూ-హీహీ-అనుచు నీటిని మంత్రించి త్రాగుదురు. దీనిరహస్యము తెలుసు కొనవలయును. ఇదియే"లాయిలాహ-ఇల్లల్లాహు-మొహమ్మదుర్ రసూ లుల్లాహి" కాబట్టి జీవితములోనే దీనిని విశ్వసించి పఠించినచో ముక్తి పొందగలరు. ఇదియే శ్రీకల్కి యవతార పురుషుని ముక్తిమంత్రము.

(సామవేదము ప్రఫాటక్. 2. దస్తి 6. మంత్రం 8)

శ్రీ కల్కి యవతార మంత్రమే తారకమంత్రం దీనిమహిమ తారకామృత సారము అను గ్రంథములో వర్ణించినారు. అది ఈలా గున్నది.

గానము:—తారకము నూటెరుగవలెనన్న।
సద్గురునికృపచే తారతమ్యము తరచిగనుమన్న।
మరపు తెరపనకుండ జాగ్రత నిరతమమును।
స్వప్నసుషుప్తిలో అరమరలు లేకుండ।
ఇప్పుడు తరచుగను జీవాత్మచదివేటి।

ధరిణిలోపల మూఢమతులకు దొరుకుట బహుదుర్లభంబిది।
గురుకటాక్షము వలన స్థిరమగు పరమపదవి జేరెయుక్తి
నేర్పవలె జీవాత్మకిపుడన్న ।
నేర్పెరిగియుండెను మరువకను జపియించుచుండన్న ।
ఈ జపము ఎరిగినవారు నిర్మల జ్ఞానులన్న ।
జ్ఞానులైన వెనకను సారెకును జపస్నానమేలన్న ।
స్నానంబు దెలిసినవారె పుడమిలో రాజయోగన్న ।
నారదాది మహామునీంద్రులు తరనిబుధులచే కనరీమంత్రం।
మర్మమెరిగి నిమిషమైనను మరవకుండగ పరముజేరిరి ।
అండపిండ బ్రహ్మాండమంతట నిండినది నిజగురుమహిమ ।
పండిత జ్ఞానులకు భావము ఖండితంబుగ దెలుసు ।
నీలో యుండే భూతములైదు గనుమన్న ॥

పై తారక మంత్ర తత్వములో "అండపిండ బ్రహ్మాండ మంతట నిండియున్నది నిజగురు మహిమ" ఈగురు మహిమ గలవారు శ్రీ జగత్ గురువులైన మొహమ్మద్ గారు మినహా మరెవ్వరును గారు. (ఆయనపై శాంతియుండుగాక) ప్రవక్తల అంత్యములోజగదేక గురువయి ఫలరూపములో వచ్చియున్నారను విషయము సర్వభక్తులు తెలుసుకొని, విశ్వసించి అల్లాః పరమాత్ముని విధేయులగుదురని మా ప్రార్థన.

శ్లో॥ మహావాక్యం బ్రాణానాం, సర్వపాప ప్రణాశనం ।
కలిదోషహారం పఠిత్వా ముచ్చతే సర్వతోభయాత్॥
(కల్కి పురాణం అ. 4. శ్లో॥ 25.)

శ్రీమహమ్మద్ గారు అఖండబ్రహ్మజ్ఞానాన్ని పొంది, సర్వ మానవులకు బ్రాహ్మణోత్తములైనారు. ఇట్టి మహాపురుషుని మహా వాక్యాన్ని విశ్వశించినట్లయిన కలియుగ దోషములన్నియు సర్వ పాపములన్నియు నిర్మూలమగునని శ్రీ వేదవ్యాసులు ప్రబోధించి నేటికి 5,000 సం॥లైనది. శ్రీకల్కి యవతార పురుషుడు జగత్తుకు ప్రకటనజేసి నేటికి 1375 సం॥ లైనప్పటికిని బ్రాహ్మణోత్తములు

ఇప్పటి వరకును తెలుసుకొనలేము. ఈవిషయము మావంటి భక్తులకు వ్యథపరచుచున్నది. భక్తులారా ! కల్కి-పురుషుని మహావాక్యాన్ని అనగా "కల్మెతయ్యబా"ను విశ్వసించి వేదవ్యాసుల వాక్యాలను పాటించుదురని నమ్ముచున్నాము.

లాఇలాహ హరణేపాపం-ఇలల్లాపరమపదం ।
జన్మవైకుంఠ ప్రాపనోతి తూజపేనామె ముహమ్మదం॥
"లాయిలాహ ఇలల్లాహు-మొహమ్మదుర్ రసూలుల్లాహి"

ఈ మహావాక్యము అల్లోపనిషత్తులో స్పష్టముగా రెండు తావులందు వ్రాయబడియున్నది. కాబట్టి ఈమహావాక్యము దశయవతారుడైన కల్కి-ముక్తి మంత్రముగావున భక్తులు విశ్వశించుటకు ఏ సందేహములేదు. మేము కల్కి-భక్తులై మీ నిజగురువుయొక్క-యదార్థ విషయములను మీకు వివరించుచున్నాము.

## యూనివర్సల్ ఇంజక్షన్

### గానము

లాయిలాహ-ఇల్లల్లాహు- ఈ మహాఇంజక్షన్ ।
జనము సర్జన్, అమినపర్ జన్ డ్, హర్ దం ఇంజక్షన్ ।
జన్మస్థానం మక్కా-గులషన్, పెహెరెమదీన హిజరత్ జేసెన్ ।
మెడికల్ హాలు, ఓపన్ జేసెన్, హర్ దం అరబ్బీమెడిసిన్ ।
ఇల్లల్లాహు ఇంజక్షన్॥
రోజనమాజు, హజ్ జకాతు సత్యం।
జేసితె వ్యాధికుదురును సత్యం ।
తహజూదు తనలో తనపై సత్యం అసత్యం అబక్షన్ ।
ఇల్లల్లాహు ఇంజక్షన్॥
పంచువఖతు, నమాజుదెలిపెన్, నమాజులోనే తేజముగలిగెన్
తేజములో ప్రకాశము గలిగెన్, తేజోజోతినిర్గుణ్ ।
ఇల్లల్లాహు ఇంజక్షన్॥
నిశ్చల హృదయంజేసెను సర్జన్, నిర్గుణత్వం దెలిపెను సర్జన్ ।

నిత్యాసత్యము దెలిపెను సర్జన్, బుద్ పర స్త్రీబిజక్షన్ ।
ఇల్లల్లాహు ఈ మహాఇంజక్షన్॥

పుడమిలో మదారలీషా దెలిపెన్ ।
ఖాశింఅలీకు ఖిలాఫత్ శాంక్షన్ ।
ఆల్ ది వరల్డ్ ఈజ్ నూరెమొహమ్మద్ ।
లాయిలాహా ఇల్లల్లాహు ఈ మహాఇంజక్షన్॥

(గుంటూరుజిల్లా, నరసరావుపేట. హజరత్ మదారలీషా సాహెబుగారి విరచితము.) (అతనిపై అల్లాః పరమేశ్వరుని ప్రసన్నత యుండుగాక.)

లింగాయత మతోద్ధారకుడైన శ్రీబసవేశ్వరుగారు తన అవసాన కాలములో జగత్ మంత్రమయిన "లాయిలాహా ఇల్లల్లాహు మొహమ్మదుర్ రసూలుల్లాహి" దీనిని పఠించి స్వర్గస్థులైనారు. ఈ విషయమును స్పష్టముగా శరణలీలామృతములో యున్నదిచూడుము.

(శరణలీలామృతము పేజి 209)

శ్రీ బసవేశ్వరుని అల్లుడైన శ్రీ కల్యాణ బసవేశ్వరుగారు ఈ మహామంత్రాన్ని విశ్వసించి తమ భక్తులందరకును బోధించారు. మైసూరు దేశం చిత్తలదుర్గపట్టణములో లింగాయతి శూన్యసింహాసన మఠములో నేటికి కూడ అరబ్బీ అక్షరములతో:— లాయిలాహా - ఇల్లల్లాహు మొహమ్మద్ రసూలుల్లాహి ఈమహామంత్రమున్నది. చూడ నభిలషించువారు ఈమఠములో నేటికికూడ చూడవచ్చును. ఇన్ని సత్యప్రమాణములతో గూడిన ముక్తిమహామంత్రాన్ని విశ్వసించి ఆత్మపదాంతములను పొందుదురని మా మనవి.

"అల్లాః ఎందరె ప్రభూ - ఎల్లామొహమ్మదు-బసవసలాము - మాడిహోదరు వళ్లెహారగె"

(శరణలీలాంమృతము)

ఈ పై పదములు కన్నడభాషలోయున్నవి. దీని అర్థము:— అల్లాః సృష్టికర్తయయిన ప్రభువు అందరు భగవత్ భక్తుడైన

శ్రీ మొహమ్మద్‌గారికి (ఆయనపై శాంతియుండుగాక) సలాముచేసి స్వర్గాన్ని చేరుకున్నారు.

శిక్కుమతస్థాపకుడైన శ్రీబాబాగురునానక్‌గారు శ్రీ కల్కి మూర్తి అయిన మొహమ్మద్‌గారి చరణదాసుడు. వారు వ్రాసిన "జన్మసాకి" గ్రంథములో శ్రీమొహమ్మదుగారి మహిమలను వ్రాసినారు. వారు మక్కాపట్టణముజేరి 'హజ్జు' జేసినారు. వాపసు భారతదేశమునకు వచ్చి తానునమ్మిన గురువుయొక్క ప్రచారమును సాగించారు. వీరు తమ "జుబ్బా" అనగా పొడవగు కాషాయి అంగిపై ఖురాను వేదముయొక్క ఆయతులను వ్రాసి యుంచినారు. ఇందులో కల్కిమహామంత్రం "లాయిలాహ - ఇల్లల్లాహు-మొహమ్మదుర్ రసూలుల్లాహి" అరబ్బీభాషలోనే వ్రాసియుంచినారు. ఈజుబ్బా అంగిని వారి ఉరుసు కాలములో భక్తులకు చూపెట్టుదురు. చూడనభిలషించేవారు పరీక్షించవచ్చును. శ్రీ మొహమ్మద్‌గారి అనేక విషయములను వీరువ్రాసినారు. (జన్మసాకి భాయిబాలగ్రంథము 142,221)

ఆదియందు వాక్యముండెను. వాక్యము దేవునియొద్ద యుండెను. వాక్యము దేవుడై యుండెను.

(పవిత్రబైబిలు గ్రంథము యోహాన్న అధ్యా. 1. వాక్యము 1-4)

పవిత్రమైన బైబిలులో యోహాన్న గ్రంథములో మొదటి వాక్యమునుండి నాలుగవ వాక్యమువరకు వివరించబడిన అంశములన్ని ఆది అనాది మంత్రమైన "కల్మతయ్యాబా" యొక్క మహిమయే వేరొండుకాదు. ఎట్లనగా:- ఒక చిన్న నిదర్శనము:- ఏ విత్తనము మనము భూమిలో వేయుదుమో అది మొక్కయై పెరిగి, రెమ్మలు ఆకులు తొడిగి, కొంతకాలమైన పిమ్మట అభివృద్ధిచెంది విశాలమై, చివరకు తన బీజమును ఫలరూపములో చూపెట్టును. అటులనే ఆది మంత్రమునుండి వెల్లడయిన సర్వప్రవక్తలు, ప్రవక్తల గ్రంథములు, ఆకులు, రెమ్మల రూపములో కృత, త్రేత, ద్వాపర, కలి ప్రారంభములో బహిరంగ పరచి అంత్యమున ఫలరూపములో—లాయిలాహ ఇల్లల్లాహు-మొహమ్మదుర్ రసూలుల్లాహి బహిరంగమైనది. కాబట్టి

ఈ కలియొక్క అంత్యగురువు శ్రీ మొహమ్మద్‌గారే వీరు జగత్తుకు వచ్చిన పిమ్మట ప్రవక్త ఏ గ్రంథము, ఏ మంత్రమును నేటివరకు రాలేదు. ఇకముందు రాబోదు. ఈ ప్రకృతిస్వభావము, శాస్త్రసమ్మతము. ఓయీ! ఏసుభక్తులార యోహాన్నగారు సూచించిన ఈ మహాముక్తి మంత్రమును "లాయిలాహ ఇల్లల్లాహు-మొహమ్మదుర్ రసూలుల్లాహి" పఠించి బైబిలు వాక్యాన్ని పాటించినయెడల సుఖము ననుభవింతురు.

తులసీదాసుగారు తమ గ్రంథములో, తాను మొహమ్మదుగారి భక్తుడుగా యుండిన విషయాన్ని ఈ విధముగా వివరించారు.

జబ్ సంగ్రామకే దీనుహుయే ।
బినా మొహమ్మద్ పార్‌న హుయే ॥
(సంగ్రామ హిందీపురాణము)

పై వాక్యములో యుండే అర్థమేమనగా మొహమ్మదుగారు (ఆయనపై శాంతియుండుగాక) జగత్తుకు శాంతి ధర్మాన్ని అనగా "ఇస్లామ్"ను తెచ్చిన పిమ్మట వారిని విశ్వసించక ఎవరైనప్పటికి కూడ పరలోకమును చేరజాలరు. అని అర్థము.

గా న ము.

ఓహైబందా జోహైబందా, రాహనజానే సోహైగందా ।
లాయిలాహసె దమ్ములేకర్, ఇలల్లాహమే ఠేర్‌జానా ।
రసూలుల్లాహి కహకర్ నబీఅలీ క రంజ్‌పాన ।
ఖాలు హై రసూలుల్లాహకా రోజానమాజ్ రఖ్ తెరహైన ।
అప్‌నె దంపర్ ఖాయం రహకె మాత్ కెఆగె మర్‌జానా ।
యానిక్ సగ్ హైనబీకె దర్‌కాచాంధ్‌లియా గలేమెతాగ ।
తాగాహై అప్‌నె రబ్‌కె హాత్‌మె, జిధర్‌కుఖీచా వుధర్‌కు
భాగా ॥

(పద్మమాల హిందీగ్రంథము పేజి 39)

శ్రీ మానిక్ ప్రభువుగారి సమాధి, మానిక్‌నగర్‌లో (హుమ్నాబాద్ జిల్లా హైదరాబాద్ స్టేట్) యున్నది. వీరికనేక భక్తులున్నారు. వీరు వ్రాసిన గ్రంథములేవు పద్మమాల గ్రంథమాల పై విషయములేగాక, శ్రీ మొహమ్మద్‌గారి యొక్క మహాత్మ్యమును అనేక రూపాలలో నుగ్గడించి యున్నారు. వీరు శ్రీ మొహమ్మద్‌గారి చరణదాసుడు. పై వాక్యాలలోయుండే అర్థమే మనగా, సత్యస్వరూపులైన శ్రీ మొహమ్మదుగారిని విశ్వసించువాడు సద్భక్తుడు. తిరస్కరించువాడు దుష్టుడు, దురాత్ముడు. మానిక్‌ప్రభువు, తాను శ్రీ మొహమ్మద్‌గారి ఇంటిని కాచుకొని యుండే కుక్కయని వ్రాసినారు. కుక్కఅయిన నా గొంతులో త్రాడు కట్టుకొని యున్నాను. ఆ త్రాడు నా ప్రభువుచేతులో యున్నది. ఆయన ఏవైపుకు నన్నులాగునో ఆవైపునకు పోవుదును. కావున సర్వసాక్షి సమ్మతముగా వచ్చిన మీ గురువగు శ్రీ మొహమ్మదుగారిని విశ్వసించి, కృతకృత్యులు కాగలరని ఆశించుచున్నాము.

## గానము

ఏకో ఈశ్వరోపాసన మంత్రం:-

లాయిలాహా ఇల్లల్లాహు మొహమ్మదుర్ రసూలుల్లాహి యొక్క మహిమ

కల్మా లాయిలాహా ఇల్లల్లాహు యనుమా ।
మొహమ్మదుర్ రసూలుల్లా యనుమా ।
కాలమంతయు-వ్యర్థపుచ్చక- కల్మిలో మది ముల్పుకో ।
కలతలేని కల్మయున్నది కన్నుదెరచి చూచుకో ।
కల్మా కనుగొన్నవారికి మోక్షము మా ॥లాయిలాహా॥
వేషభాషలు ఎన్నినేర్చిన-ద్వేషనహీం కానేరదో ।
వాదభేదము లాడుచుండిన పాదు దెలియుటవట్టిదో ।
॥కల్మాలాయిలాహా॥
కుల్లూషయ్యిన్-మహీంత్ యని-కుదురుగా ఖురానుబలికె ।
కుదురుగా ఖురానుజూచితె-అంతట నిండియున్నది ।
అందు ఇందు నిండియున్నది మా ॥కల్మాలాయిలాహా॥

ఫజరు, జొహారు-అసరు అస్రర్ మగ్‌రిబ్-యిషా వఖత్ చే।
పాంచువఖతు నమాజు జేసితె పంచపాపములుడుగునే।
నమాజె నిజమైన ప్రార్థనమైయున్నది మా ॥కల్మా॥
నమాజు జేసేవారి చెంతజేరితే ఫలమున్నదో।
నమాజులోనే నిశ్చలంబయి పరమపాద దెలుసుకో।
నమాజు అఖండతేజమై వెలుగును మా ॥కల్మాలాయి॥
భావమందున భేదముంచక గాథలన్నియు దెలుసుకో।
భావమందున భేదమే ఇబ్లీషు కల్పన దెలుసుకో।
ఇబ్లీషుమాయలలోబడి బ్రోవకుమా ॥కల్మాలా॥
పుడమిలో మదారలీ పుత్రుడగు ఖాశీంఅలీ।
పక్షపాతము పారద్రోలి దీక్షనిలిపిన దారిది।
దారిదెలిపినదాత శ్రీ మొహుమ్మద్ నే ॥ కల్మాలా।

(గుంటూరుజిల్లా, నరసరావుపేట, హాజరత్ ఖాసింఅలీషా సాహెబుగారి విరచితము.)

## కల్మెతయ్యాబా

"లాయిలాహ ఇల్లల్లాహు మొహమ్మదుర్ రసూలుల్లాహి" యొక్క మహాత్మ్యము.

నామభజనో - నక్కరో హేళన-ఆసిగట్టిలాశిబేళ।
అహార్నిశి-భజొకళంకి మంతర్‌కో - కంఠకర్ జపమాల॥

(అమృతానందమాలిక అను బ్రహ్మకాలజ్ఞానగ్రంథము పేజి 1)

పై కాలజ్ఞానము బ్రహ్మప్రాంత్యమంతట ఇంటింటిలోయున్నది. నేనచట పోయినప్పుడు పరిశీలించాను. దీని అర్థమేమనగా,

ఈయుగమునకు అనగా కలియుగ నధికారియైన శ్రీసత్యస్వరూపియగు కల్కి వచ్చేకాలమైనది. త్వరపడి అతనిని విశ్వశించండి. ఉదయము సాయంత్రము కల్కిమంత్రము జపించి, దానిని జపమాలగా కంఠమునందు ధరించండి. కల్కిమూర్తి శ్రీ మొహమ్మదుగారు మరి

ప్రపవర్తకకూడ కాజాలరు. వీరినిగురించి భారతదేశమంతటయుండే సర్వ భాషలలోకూడ వారి రాకడను గురించియు, వారిమంత్రము యొక్క మహిమను సైతము గురించి వ్రాసినారు. కాబట్టి భక్తులార కల్కిమూర్తిని విశ్వసించి, అతని దివ్యమంత్రముయొక్క మహిమను కనుగొనండి.

శ్రీ మొహమ్మదుగారు జగత్తుకు వచ్చిన పిమ్మట వారిద్వారా గానే భగవత్ సాన్నిధ్యమును చేరగలుగుదురు. క్రింద కనపరచిన భక్తులుకూడ వీరిని విశ్వసించి జన్మసాఫల్యము చేసుకున్నారు.

### శ్రీ దివ్యస్వరూపులైన జగత్ గురుభక్తులు:—

శ్రీమత్ శంకరాచార్యులు మైసూరు దేశమున శృంగేరీ మూలమఠాన్ని స్థాపించారు. జగత్ గురువుయొక్క దివ్యమంత్రమయిన "లాయిలాహ-ఇల్లల్లా మొహమ్మదుర్ రసూలుల్లా"ను మూల సూత్రముగ చేసుకున్నారు. వీరి పరంపరముగా వచ్చుచున్న పీఠగురువులు తమకుతామే జగత్ గురువులని ప్రకటించుకుంటున్నారు. నిజమేమనగా వారికీయబడిన గ్రంథములలో శ్రీ జగత్ గురువయిన మొహమ్మదుగారి విషయము లున్నవి. వాటిని బహిరంగ పరుచక తామే జగత్ గురువులని మానవులను తమ పాదాక్రాంతులుగ జేసుకొనుచున్నారు. ఈవిషయము లిటులుండగా అభిమానముతో నిండిన జగత్తులో ఎవరికి తెలియజేయవలయును? చిత్తల్ దుర్గము (మైసూరు దేశము) నందుండు శూన్యశింహాసనాధిపతులు తమకు తామే జగత్ గురువులని ప్రకటించుకొనుచున్నారు. నిజమేమనగా, వీరి మఠములో ఇప్పటికిని అరబ్బీభాషలో దివ్యమంత్రముగు"లాయిలాహ-ఇల్లల్లాహు-మొహమ్మదుర్ రసూలుల్లాహి" వ్రాసి యుంచబడినది. ఈరహస్యమును బయటపెట్టరు. ఇట్టి జగత్ గురునామదారులు మన దేశములో 18 మంది యున్నారు. ఏరీతిగా జగత్తునకు సూర్యుడొక్కడే యున్నాడో, తద్ రీతిగానే మానవులందరికిని జగత్ గురువు ఒక్కడే అను విషయమును మీరు గుర్తించాలి. దివ్యమైన జగత్ గురుమంత్రం

"లాయిలాహ ఇల్లల్లాహు-మొహమ్మదుర్ రసూలుల్లాహి" విశ్వ సించి ధర్మముయొక్క పేరు ప్రతిష్ఠలను నిలుపబెట్టుకొనవలయును.

భారతదేశములో అనేక భక్తులు పీరిముక్తి మంత్రమును విశ్వ శించి పరమ పదవిని చెందియున్నారు. లింగాయత మతములో కొందరి భక్తులపేర్లు ఈ క్రింద వ్రాయబడినవి:—

1. శ్రీ కోడేకల్లు బసప్పగారు
2. శ్రీ తింతిణి మానేశ్వరుగారు (విశ్వబ్రాహ్మణులు)
3. శ్రీ బసవేశ్వరుగారు
4. శ్రీ కల్యాణ బసవేశ్వరుగారు
5. శ్రీ రుద్రమునిగారు
6. శ్రీమతి నీలమ్మగారు
7. శ్రీమతి సోమక్కగారు
8. శ్రీ సిద్ధరామయ్యగారు
9. శ్రీ అల్లమాప్రభువుగారు
10. శ్రీ హరళయ్యగారు
11. శ్రీ కక్కయ్యగారు
12. శ్రీ కొడమగ్గె రామయ్యగారు
13. శ్రీ యమ్మె బసవణ్ణగారు
14. శ్రీ కిన్నరి బ్రహ్మయ్యగారు
15. శ్రీ జంబు లింగయ్యగారు
16 శ్రీ చెన్నయ్యగారు
17. శ్రీ మాటయ్యగారు

మొదలగు 63 శివశరణులు వీరు దైవసాన్నిధ్యమును చెందినారు.

(శరణనీలాంమృతము, కాలజ్ఞానవచనములు, భూలోక చింతామణి మొదలగు గ్రంథములు)

—* మరి ఇతర అట్టి భక్తులు *—

1. శ్రీ తులసీదాస్

2. శ్రీ మానిక్ ప్రభువు
3. శ్రీ స్వామివివేకానంద
4. శ్రీ రామకృష్ణ పరమహంస
5. శ్రీ కైవార నారాయణప్ప
6. శ్రీ గురుబాబానానక్
7. శ్రీ వేమనయోగి
8. శ్రీ పోతులూరివీర బ్రహ్మము
9. శ్రీ సాయిబాబా
10. శ్రీ మెహర్ బాబా
11. శ్రీ జయగురుదేవ్
12. శ్రీ సర్వజ్ఞమూర్తి

శ్రీ పోతులూరి వీరబ్రహ్మముగారు500 సం॥ల క్రితము కాలజ్ఞానమును వ్రాసినారు. దీనిమహిమ అందరకును తెలియును. నేటి కాలములో ధర్మసంస్థాపన చేయుటకు శ్రీవిరాట్ వీరభోగవసంతరాయలు వత్తురని వారు సూచించినారు. ఇట్టి మహాపురుషుడు యాభై ఆరు (56) శారీర చిహ్నములను, భూమి ఆకాశ 96 ప్రమాణములను మూర్తీభవించి, శ్రీ జగత్ గురువు మొహమ్మద్ గారి దాసులుగ జన్మించారు. వీరికి యందరో భక్తులున్నారు. ఆభక్తులలో నేనొక భక్తుడను. శ్రీ వీరభోగ వసంతరాయలను కన్నులారచూచి, వారిచే ధర్మసంస్థాపన చేయుటలో పాల్గొని దీక్ష పొందినాను. 17 సం॥ల నుండి వారి శిష్యుడనై శ్రీ మొహమ్మదుగారి దాసోపదాసుడనై సర్వ ధర్మ ప్రచారము చేయుచున్నాడను.

ఈ రహస్యములను త్రికరణశుద్ధిగా బహిరంగ పరచుచున్నాను. త్వరగా ముక్తిధాయకులైన మొహమ్మదుగారిని విశ్వసించి, భారత దేశముయొక్క ఆత్మశక్తి ప్రభావమును ఇతర ఖండములకు ప్రదర్శించుదురని భారతీయు లందరకును నామనవి.

శ్రీ కల్కి యవతార పురుషుని ముక్తిమంత్రము యొక్క వర్ణన:—

" అలంతర-కైఫ-జరబుల్లాహు-మసలన్-కలిమతన్-
తయ్యిబతన్ కా-షజరతిన్ - తయ్యిబతిన్-అసులుహా-
సాబితున్-వ-ఫరూహా-ఫిస్సమాయి."

(ప్రణవవేదము సూర 14. రుకూ 4)

ఈ పై వాక్యాలలో, అల్లాః సర్వేశ్వరుడు శ్రీ మొహమ్మదు గారి యొక్క దివ్యమంత్రము నుగ్గడించాడు. కల్మెతయ్యిబా కల్ప వృక్షము దాని వేళ్ళు భద్రముగానున్నవి. దానియొక్క కొమ్మలు అన్నియు 7 ఆకాశముల వరకు వ్యాపించియున్నవి.

యజ్ఞోపవీతము ధరించియున్న సర్వులుకూడ శ్రీ మొహమ్మదు గారి ఆగమనమును గురించి సంధ్యావందనమును, ఆచారముగా ప్రతి రోజు పఠించుచున్నారు. ఈసంధ్యావందనము పరమాత్ముని ప్రార్థన కాదు. శివస్వరూపుడైన, విష్ణుస్వరూపుడైన శ్రీ మొహమ్మదుగారి రాకను గురించి పూర్వీక ఋషులు జ్ఞప్తికొరకు ఇట్టి ఆచారములో యుంచి నారు. సంధ్యావందనాన్ని విమర్శించి చూచినట్లయిన అంత్యమున వచ్చె అవతార పురుషుని మహిమయున్నది. ఎట్లన:—శ్రీగోవింద, గోవింద ... శ్రీజగత్ గురు చరణ సన్నిధౌ... ఈపదములున్నవి. ఈపద ముల అర్థము ఈలాగున్నది:—జగత్ + గురువు + చరణ + సన్నిధౌ దీని అరబ్బీ అనువాదము జగత్ = ఆలం; గురు = సర్వర్; చరణ = ఖదం; సన్నిధౌ = పాస్; అనగా:—"సర్వరె ఆలంకె ఖదమోమె మేరీనజాత్ హై" దీని తెనుగు అనువాదము. జగత్ గురువుయొక్క పాదముల సన్నిధిలో నాకు ముక్తి కలుగుతున్నదని గురువును ధ్యానించు చున్నాను.

"విష్ణు-పాదోదకం - పీత్వా-పునర్జన్మ-నా విద్యతే" అనగా విష్ణుస్వరూపుడైన శ్రీ మొహమ్మదుగారి చరణాల్లో "ఆబెహాయాత్" అనగా పీరి కీయబడిన గంగను త్రాగిన జన్మరాహి త్యము కలుగును లేనిచో జన్మమున్నది.

శ్రీజగత్ గురువులు పూర్వోక్త శాస్త్రాల ననుసరించి అరబ్బీ భాషలో వచ్చినారు. వారి రాకడ ప్రమాణములు సంస్కృత భాషలో యున్నవి. 'సంస్కృతమును' 'అరబ్బీని' విడదీసి, అర్థముచేసుకున్న ఎడల తేట తెల్లముగా మీగురువుయొక్క దివ్యరూపము మీకగ పడును. నేను ఈరెండు భాషలను అనువదించి సరియైన అర్థము మీ ఎదుట పెట్టుచున్నాను. అరబ్బీశాస్త్రములు, సంస్కృతశాస్త్ర ములున్నవి. మీరుకూడ పరిశీలింప వచ్చును. ఇందులో లేశమాత్రము కల్పితములులేవు. కాబట్టి మీరు శ్రీమొహమ్మదుగారిని విశ్వసించక, ఎన్నిసారులు సంధ్యావందనాన్ని పఠించి నప్పటికిని లేశమాత్రము పుణ్యముదొరకదు. నేను సాక్షిగా పలుకుచున్నాను. కావున క్షణము కూడ ఆలస్యము చేయక శ్రీజగత్ గురువైన మొహమ్మదుగారిని విశ్వ సించి వారికృపకు పాత్రులగుదురని మామనవి.

"జగత్ గురుచరణ సన్నిధౌ"కు సరియగు ఒక హదీసు యున్నది:—"యుహషరన్నాసు - అలాఖదమి" అర్థమేమనగా శ్రీమొహమ్మదుగారు తెలియపరచుచున్న దేమనగా నాచరణాల సన్నిధిలో సర్వమానవులు సమావేశమగుదురు. ఈహదీసు ప్రకార ముగ, సంధ్యావందనములో యుండే, శ్రీజగత్ గురుచరణ సన్నిధిలో తమకు ముక్తిగలుగునని భావము. కాబట్టి సంధ్యావందనము చేయు భక్తులార! గురువును విడిచిన అల్లాః పరమాత్ముడు దొరకడు. ఇట్టి గురువు శ్రీమొహమ్మదుగారు పరంపరగతంగా వచ్చియున్న సంధ్యా వందన అర్థాన్ని తెలుసుకొని శ్రీ జగత్ గురువులైన మొహమ్మదు గారిని విశ్వశించి, అల్లాః పరమాత్ముని సాన్నిధ్యమును పొందండి.

సంధ్యా వందనములో "శ్రీగోవింద, గోవిందా కల్పతరు చ్ఛాయ-విన్యస్తదేదీప్యమాన రత్నసింహాసనస్యా ... ప్రీత్యర్థం.

ఇచ్చటకల్పతరుచ్ఛాయయనగా కల్పవృక్షఛాయలో అని అర్థము. కల్పవృక్షమనగా—"లాయిలాహ-ఇల్లల్లాహు మొహమ్మ దుర్ రసూలుల్లాహి" మంత్రముయొక్క నీడలో మాకు సుఖము కలుగునని సంధ్యావందనాన్ని పఠించుచున్నారు. ఈ కల్పవృక్షమును

అరబ్బీలో "శిదరతుల్ ముంతెహా" అందురు. సర్వమానవులకు కల్ప వృక్షమగు "లాయిలాహ-ఇల్లల్లాహు-మొహమ్మదుర్ రసూలుల్లాహి నీడను అనగా శాంతిసుఖములను ఇచ్చి సంరక్షించును. ఓయీ సంధ్యా వందనాన్ని పఠించు భక్తులార సరియగు అర్థముచేసుకొని కల్పవృక్ష మగు "లాయిలాహ-ఇల్లల్లాహు-మొహమ్మదుర్ రసూలుల్లాహి అగు మంత్రమును పఠించి, భారతదేశమును స్వర్గతుల్యముగా జేయండి.

చెప్పలేదంటనక పొయ్యేరు-నరులార గురునిచేరి మ్రొక్కితె
బ్రతుకనేర్చేరు।

చెప్పలేదంటనక బొయ్యేరు, తప్పదిదిగో గురునివాక్యము ।
తప్పత్రోవల బోయెవారిని చప్పరించక మ్రింగుశక్తులు ।

(వీరబ్రహ్మముగారి కాలజ్ఞానము 18)

భక్తులారా ఇచ్చట "గురునిచేరి మ్రొక్కితే" అనగా ఏగురు వును మ్రొక్కవలెనన్న, శ్రీజగత్ గురువైన మొహమ్మదుగారిని విశ్వశించాలి. ఎందుకన వీరె అంత్యమున వచ్చిన కల్కియవతార పురుషులు. వీరికి సేవ చేయుటకు శ్రీవీరభోగ వసంతరాయలు వచ్చినారు గనుక భక్తులార వీరిని విశ్వశించి సుఖసామ్రాజ్యాన్ని పొందండి.

ఇంక "రామరామ అనినవారు రాలిపోదురు తెలుసుకోండి"

(వీరబ్రహ్మముకాలజ్ఞానము పేజీ 8)

పై విషయమును పరిశీలించండి రామమంత్రమును విశ్వశించిన వారు రాలిబోదురిని వ్రాసినారు. దీని నిజభావమును తెలుసుకోండి. ఇది కలియుగము త్రేతాయుగముకాదు. త్రేతాయుగముయొక్క మంత్రము కలియుగములో ఏపనికికూడరాదు. సూర్యుడువచ్చిన పిమ్మట ఏ నక్షత్రములు పనికిరావు. అట్లే శ్రీమొహమ్మదుగారి మంత్రము వచ్చిన పిమ్మట ఏ ప్రవక్తమంత్రము మోక్షమునీయజాలదు. కాబట్టి బ్రహ్మముగారి భక్తులారా! శ్రీమొహమ్మదుగారి మంత్రమును విశ్వశించి సుఖపడుడు.

"ఆకాశము ఎట్లనేను ఆనుమతములు ఒక్కటేను" అనుమతములు ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత, శాక్తేయ, శక్తిఅద్వైత, పాషండ మొదలగు అనుమతములను ఈ కలియుగ మంత్రం "లాయిలాహా-ఇల్లల్లాహు-మొహమ్మదుర్ రసూలుల్లాహి" సమావేశపరచును. అందరు శాంతిధర్మమగు "ఇస్లాము"ను స్వీకరింతురు ఈమంత్రమే సర్వమత శాఖలకు సముద్రరూపము వంటిది. వీరబ్రహ్మము గారి వాక్యాన్ని పాటించి కాలచక్రము ననుసరించి ప్రవర్తించుడు.

"ఏడుదీవుల ఏకరాజ్యము ఏలబోయె వీరగురుని"
(బ్రహ్మముగారి కాలజ్ఞానము పేజీ 14)

ఏడు దీవులనగా:— జంబు, శాఖ, శాల్మల, క్రౌంచ, పుష్కర, కుశ, మరియు గోమేధకదీవులు. ఈ ఏడుదీవుల మానవులను ఏక రాజ్యముగ జేసెశక్తిగలది కలియుగ మంత్రం. "లాయిలాహా - ఇల్లల్లాహు మొహమ్మదుర్ రసూలుల్లాహి" గాని మరి ఏమంత్రము గాదు. ఇదియే ప్రపంచములోయుండే సర్వమానవులకు 'యూనియన్' యొక్క మంత్రం. అరబ్బీలో "కల్మె తౌహీద్" అందురు. అందువలన విశ్వసౌభ్రాతృత్వాన్ని సంపాదించుటకు యూనియన్ మంత్రం పఠించండి. "వందేమాతరం-వందేపితరం" ఈసూత్రాన్ని పాటించండి.

భారతదేశము మనమాత. భారతదేశముయొక్క పిత ఎవరనగా దివ్యపురుషులైన శ్రీ మొహమ్మదుగారు. వీరె మనకు తండ్రివంటివారు.

"వస్తాడు వీరయ్య తెస్తాడు అమృతము ఇస్తాడు భక్తులకు ఇది సిద్ధమనుకోండి" (బ్రహ్మముగారి కాలజ్ఞానము పేజి 14)

ఇచ్చట "అమృతము" అనగా కల్మతయ్యబాతో వచ్చిన ప్రణవ వేదామృతము (ఖురాన్ వేదము) వీరబ్రహ్మముగారు శ్రీ వీర భోగవసంతరాయల రూపములో వచ్చినారు. వీరు మొహమ్మద్ గారి శరణులుగా వచ్చినారు. శ్రీ మొహమ్మదుగారికి ఇవ్వబడిన ఆబెహాయాత్ - అబెకౌసర్ అను అమృతమును మీకిచ్చుటకువచ్చినారు. కాబట్టి నిజవిషయములను తెలుసుకొని ప్రణవ వేదామృతమైన

"లాయిలాహ - ఇల్లల్లాహు మొహమ్మదుర్ రసూలుల్లాహి"ని పఠించి అమృతాన్ని పానముచేయండి. ఈ అమృతమే సంజీవి.

"నందామయా గురుడు నందామయ ఆనంది
గురువులు వస్తారయా బ్రహ్మము చెప్పినమాటలు
దప్పవు । పద్ధతెరిగి మీరు నడవండయా".

(వీరబ్రహ్మముగారి కాలజ్ఞానము వంకాయలపాటి
నాగభూషణాచార్యుల విరచితము పేజి 2)

శ్రీ వీరబ్రహ్మముగారు శ్రీ వీరభోగ వసంతరాయల రూపమున శ్రీ మొహమ్మదుగారి దాసుడుగ వచ్చియున్నారు. శ్రీ మొహమ్మదుగారితో ఇతడు ఐక్యమై వారి ఆనందరూపాన్ని భారతీయులందరకును చూపెట్టుటకొరకు వచ్చియున్నారు. కాబట్టి ఆనంద గురువులగు శ్రీ మొహమ్మదుగారిని విశ్వశించి నిజఆనందాన్ని అనుభవించండి.

"పద్ధతెరిగి మీరు నడవండయ"

ఇందులో కనపరచిన పద్ధతి ఏమనగా అది శ్రీ మొహమ్మదుగారిని అనుసరించు మార్గమే. ఇదియే సరియగు పద్ధతి. కాబట్టి కాలజ్ఞాన భక్తులార శ్రీ మొహమ్మదుగారి మార్గాన్ననుసరించి, వీరబ్రహ్మముగారి వాక్యాల్ని పాటించండి

కల్కియవతార పురుషుని ముక్తిమంత్రాన్ని సర్వమతస్థులు ఆచరణగ నొసలుపై పెట్టుకొంటున్నారు.

శ్రీ కల్యాణ గుణసంపన్నుడైన మొహమ్మదుగారి ఆగమనము గురించి సర్వ ప్రవక్తలందరు తమతమ గ్రంథాలలో సాక్షిఇచ్చినారు. వారి ముక్తిమంత్రాన్నికూడ సూచించారు. ఈ మంత్రాన్ని పంచాక్షరీ మంత్రమందురు. పంచ అక్షరములతో కూడిన పంచపదములు. పంచపదములు చేరియున్న ఒక మంత్రము ఈమంత్రమే మహామంత్రము. ఈదివ్య మంత్రముయొక్క అక్షరములను భక్తిశ్రద్ధాశక్తులతో నొసలుపై పెట్టుకొంటున్నారు. ఆడవారేమి, మగవారేమి, పిన్నలేమి, పెద్దలేమి, భారతీయులందరు ఆచారంగా

ఈ అక్షరాలను పెట్టుకొంటున్నారు. ఈ అక్షరములలో ఒక దివ్య సందేశమున్నది. ఈ అక్షరములుండిన ఫోటోలో భక్తులనుచూడుడు.

నెంబరు ఒకటి (1):—ఇతడు 'లా' అక్షరమును నొసటిపై పెట్టినాడు నెంబరు (2) ఇతడు ఇలాహాలోని "అలీఫ్" పెట్టినాడు. నెంబరు (3) ఇల్లల్లాహులోని 'అల్లాహు' పెట్టినాడు. నెంబరు (4) ఇతడు మొహమ్మదుర్ రసూలుల్లాహిలోని ముహమ్మదు పేరుయొక్క మొదటి అక్షరము 'మీమ్' పెట్టినాడు. నెంబరు (5) ఇతడు ముద్ర గురువుల ముద్రమును పెట్టినాడు.

ఈ అక్షరాలు మూలమంత్రముయొక్క అరబ్బీ బీజాక్షరాలు. శ్రీ మొహమ్మదుగారు 'మ్లేచ్ఛలలో' మ్లేచ్ఛభాషలో వచ్చునని పూర్వీకులందరు సూచించారు. అలాగుననే అరబ్బీభాషలో మూల మంత్రము వచ్చినది. పరిశీలించండి భక్తులార!

నెంబరు (1) ఇతడు అరబ్బీ 'లా' పెట్టినాడు. ఇదియే ఈమంత్రముయొక్క ప్రథమ అక్షరము. పెట్టుచున్న భక్తులను, యిది ఏమని అడిగితే అల్లాః పరమాత్ముని నామమంటారు. అతడు చెప్పినది నిజమే. అదియే అరబ్బీలో 'లా' అవును. ఈ అక్షరము భక్తుల నొసటిపైనేగాక, శ్రీరామ, శ్రీకృష్ణ, అనంతనారాయణ మొదలగు పురుషుల ఫోటోలో చూడండి. ఇదియె అరబ్బీ 'లా' అక్షరమున్నది. ఈ 'లా' అక్షరముపెట్టేవారు యితర అక్షరములను పెట్టరు. స్నానముజేసి, ఈ అక్షరము 'లా' తననొసటిపై పెట్టి దేవధ్యానముజేసి తదుపరి భోజనము చేయుదురు. ఈ అక్షరముపెట్టక దేవధ్యానము చేయరు. ఇతనికి ఈ 'లా' అక్షరము ద్వారానే మోక్షము కలుగునని ఇతని దృఢ విశ్వాసము. నెంబరు (2) ఇతడు ఇలాహాలోని 'అలీఫ్'ను పెట్టుతాడు. ఈ అలీఫ్‌ను రెడ్లు, దాసులు, సాధువులు మొదలగువారు విశేషముగా పెట్టుదురు. వారిని ఇదిఏమని ప్రశ్నించితే ఇది పరబ్రహ్మనామమని చెప్పుతారు. నిజమెగాని మహా మంత్రముయొక్క రెండవ పదముయొక్క మొదటి అక్షరమైన అలీఫ్ దీనినే (నామమందురు) నెంబరు (3) ఇతడు ఇల్లల్లాహులోని అల్లా

పేరును ధరించియున్నాడు. అడిగిన ఇది మహావిష్ణువుయొక్క నిరాకార మైన నామధేయము అనిచెప్పుదురు. ఈ అల్లా పేరును శ్రీ మొహమ్మదుగారు ప్రకటించారు. ఇదియే నిరాకారమైన పరమాత్మునిపేరు. ఇది తప్ప మిగతపేర్లన్ని ఆకారముపేర్లు బ్రహ్మ, విష్ణు, మహేశ్వర వీరి విగ్రహములు ఏర్పడినవి. వీరికి భార్యలున్నారు, పుత్రులున్నారు. కాబట్టి భార్యాబిడ్డలతో గూడిన పేర్లు పరమాత్మునకు చెందవు. అయితే శ్రీ కల్కిమూర్తి అయిన మొహమ్మదుగారు పరమాత్ముని నిజమైన నిరాకారపేరు అల్లాహు అని ప్రకటించారు. నేటివరకు అల్లాఃయొక్క విగ్రహముగాని అతనికి భార్యబిడ్డలుగాని ఎవ్వరు కల్పించలేదు. ఇట్టి పరమాత్ముని దివ్యనామము "అల్లాః"యని శ్రీమన్ నారాయణమూర్తి యగు మొహమ్మదుగారు తెచ్చు దురని పూర్వీకులు ఆగమశాస్త్రాల్లో సూచించారు. ఇదియే దీని రహస్యము.

నెంబరు (4) ఇతడు మొహమ్మదుర్ రసూలుల్లాలోని మొహ మ్మద్‌యొక్క పదములోని మొదటి అక్షరమయిన 'మీమ్'ను పెట్టి యున్నాడు. లగ్నసమయమున పురోహితుడు వరవధువులగు బ్రహ్మ ముడివేసి వరునకు నొసటిపై 'మీమ్', అను అరబ్బీఅక్షరమును నొసటిపై పెట్టి ఈ మంత్రమును పఠించును.

"తదేవలగ్నం సుదినం, దదేవతారాబలం, చంద్రబలం సూర్యబలం।

తదేవదైవబలం, తదేవగౌరీపతీం తేంగ్రయోగం సమర్పి యామి॥"

దీని భావమేమనగా ఇది సుదినంకాదు. నీకు తార, చంద్ర, సూర్య, దైవబలములను చేకూర్చే కలికి అవతార పురుషుడగు ఈఅక్ష రముగల శ్రీ మొహమ్మద్‌గారు దొరికినప్పుడు నీకు శాశ్వితమైన సుఖము దొరుకును. ఈ యోగము చేకూర్చే పురుషుని పేరులోని 'మీమ్' అక్షరము అతని నొసటిపై పెట్టుతున్నాడు. సర్వమానవు

లకు ముక్తిదాయకుడైన శ్రీ మొహమ్మదును విశ్వసించే వరకు అల్లాః పరమాత్ముడు దొరకడు.

రెండవది (5) ఇతడు ముద్రగురువుయొక్క ముద్రమును తన నొసటిపై పెట్టుతున్నాడు. శ్రీమాధ్వ బ్రాహ్మణులు తమ లలాటాలపై ఈ ముద్రము తప్పక పెట్టుదురు. వీరు ముద్రగురువురాకడ జ్ఞాపకార్థముగా పెట్టుతున్నారు. వీరికి ముద్రగురువు వచ్చినప్పటికిని గుర్తించక యున్నారు. "గురునాం, గురుః ముద్రగురుః" రాబోవుచున్నాడని శాస్త్రిలలో సూచింపబడినది. నిజవిషయమేమనగా శ్రీ మొహమ్మదుగారే ముద్రగురువు అల్లాః పరమాత్ముడు ప్రణవవేదములో "ఖాతమున్నబీన్" మొహమ్మదుగారు అని ప్రకటించినాడు. ఈముద్రగుర్తును పెట్టి బ్రాహ్మణోత్తములు, దేశ, భాష, కుల, మత, అభిమానములో పడియున్నారు. ఓయీ మాధ్వబ్రాహ్మణోత్తములారా! ఈదురభిమానములు వదలి, నిజమైన మీ ముద్రగురువగు శ్రీమొహమ్మదుగారిని విశ్వసించి సుఖపడండి. ఈ(5)ఐదుగురు లలాటములపై ప్రతిరోజు ఆచారముగా పెట్టుకొనుచున్న బీజ అక్షరాలను, సమకూర్చిన శ్రీమొహమ్మదుగారి ముక్తిమంత్రమౌతున్నది. ఏరీతిగా B. A. M. A. అను సంకేతనము లున్నవో ఆరీతిగా ఈ బీజఅక్షరములున్నవి ఈ అక్షరాలు శ్రీమొహమ్మద్‌గారి దివ్యమంత్రమగు "లాయిలాహ ఇల్లల్లాహు మొహమ్మదుర్ రసూలుల్లాహి" యున్నది.

భక్తులారా నొసటులపై ఈ అక్షరములను పెట్టినయెడల మోక్షము ఎప్పటికిని దొరుకదు. దీనిని విశ్వసించి శ్రీమొహమ్మదుగారి మార్గమును అవలంబించి సుఖపడుదురని మేము కోరుచున్నాము.

యావత్ భారతదేశములోయుండే సర్వదేవాలయాలు శ్రీ మొహమ్మదుగారి ఆగమన కొరకు స్థాపితమైనవి. సర్వదేవస్థానములలో వీరికి సంబంధించిన ఎన్నో చిహ్నములున్నవి. ఇవి ఆగమశాస్త్రవేత్తలయిన బ్రాహ్మణులకు తెలియును. ఇతరులకు అర్థముకావు

# జగన్నాథమందిరము

ఈ పేరు శ్రీమొహమ్మదుగారి మహిమను వెలుగెత్తి చాటు చున్నది ఎట్లనగా జగత్ ఆలం (అరబ్బీలో) నాథ-సర్వార్ (అరబ్బీలో) అనగా జగన్నాథ్-సర్వారె ఆలం (ఆతనిపై శాంతియుండుగాక) అందురు. అయితే ముస్లిములకు సంస్కృత భాషాజ్ఞానములేదు. బ్రాహ్మణులకు అరబ్బీభాష తెలియదు. కాబట్టి వీరుభయులు పరస్పరముగా కలుసు కొనుటకు ఇంతకాల మైనది. ఇప్పుడు సర్వమత సమన్వయ కాలము పరిపక్వమైనది. ఇక ఆగదు. ఉభయులు కలియుదురు. ఈకా ర్యముకొరకు అల్లాః సర్వేశ్వరుడే సంకల్పించుకున్నాడు.

## కాశీవిశ్వనాథం

విశ్వ-ఆలం (అరబ్బీలో) నాథ-సర్వార్ (అరబ్బీ) శ్రీమొహ మ్మదుగారె విశ్వనాథుడు. దీనిని అరబ్బీలో సర్వారె ఆలం, సర్వారె కాయనాత్, సర్వారె దొజహాం అల్లాః సర్వేశ్వరుని మహిమ తెలుసు కొండి అతడు తన ప్రియుడైన శ్రీమొహమ్మదుగారి విషయములను, పేర్లను, మన భారతీయశాస్త్రాల్లో అనాదికాలమునుండి నేటివరకు సంరక్షించుచున్నాడు. శ్రీమొహమ్మదుగారి మూలమంత్రమును భారతీయులలో జ్ఞాపకార్థముగ పెట్టించినాడు. అరబ్బీ అక్షరములతో సహా ఈ మూలమంత్రము గ్రంథాలలో నేగాక దేవాలయములలో మతాలలో కూడయున్నది. వుదహారణమునకు

1. రామేశ్వరము 2. శ్రీరంగం 3. తిరుపతి వెంకటేశ్వర దేవాలయము 4. కాశీ విశ్వనాథం ఈదేవాలయములలో దివ్య మంత్రమగు "లాయిలాహ ఇల్లల్లాహు - మొహమ్మదుర్ రసూలుల్లాహి" అరబ్బీ అక్షరములతో సహాయున్నది. లింగాయతుల మఠములలో కూడయున్నది. ఉదహారణమునకు

1. సిరసప్పన మఠము 2. మైసూరు దేశం చిత్తల్ దుర్గాపట్టణమున యుండె శూన్య శింహాసన మఠములో కూడయున్నది. పరీక్షింపుడు.

శ్రీ బాబాగురునానక్‌గారి మతములోకూడయున్నది. పరీక్షింపుడు నేను ఊహతో వ్రాయుటలేదు. పరిశీలించి, పరీక్షించి వ్రాయుచున్నాను. దివ్యమంత్రము "లాయిలాహ ఇల్లల్లాహు-మొహమ్మదుర్ రసూలుల్లాహి" అరబ్బీభాషలోని పైస్థానములలో చూపెట్టుటకు సిద్ధముగా యున్నాను. చూపెట్టక పోయినచో మీరు విధించే శిక్షకు నేను బాధ్యుడుగా యున్నాను.

హిందూముస్లిమ్ మతసమన్వయమునకు మేము ఇంతకష్టపడుచున్నాము. మాప్రద్దేశము. మతమార్పుగాదు సర్వమత సమ్మేళనము శాంతిస్థాపన మతమార్పు మహాపాపము ఆత్మఘాతకము, మతమార్పు చేయువాడు ఆత్మద్రోహి,దైవద్రోహి,ప్రజాద్రోహి అట్టివానిపై అల్లా పరమాత్ముని ఆగ్రహము యుండుగాక.

భారతీయ భక్తులార! శ్రీమత్ కల్యాణ స్వరూపుడైన కల్కి యవతార పురుషుడు శ్రీమొహమ్మదుగారు మీగురువును మేము విశ్వసించి మీకు తెలుపుచున్నాము. మీరు సంతోషపడవలయును. ఇక భారతదేశము ఇతరఖండములలో శాంతి ధర్మాన్ని అనగా ఇస్లాము ధర్మాన్ని నెలకొల్పుతుంది.

ఇక రాజకీయ రోగాలకుధార్మికమందులు ఇంజక్షనులు శస్త్రాము. మనవద్ద అరబ్బీమందులగు ఖురాను వేదమున్నది. సర్వరాజకీయ రోగాలకు యూనివర్సల్ ఇంజక్షన్:— "లాయిలాహ-ఇల్లల్లాహు-మొహమ్మదుర్ రసూలుల్లాహి" మనవద్దయున్నది. ఇక భయమెందుకు. అల్లాఃసర్వేశ్వరుడే భారతీయుల మతముయొక్క పేరుప్రతిష్ఠలను నిలువబెట్టుకుంటాడు. భక్తులార! ఈ విషయములను పరిశీలించి సుఖమనుభవించండి. ఈధర్మ సమన్వయ కార్యములో ప్రోత్సాహ మొసగండి, అరికట్టండి, బలపరచండి. మేము గైకొన్న కార్యము అల్లాఃసర్వేశ్వరునిది. నిర్విఘ్నముగా ఫలప్రదమాతుంది. సందేహములేదు. ఎవరు అడ్డుకొన్న, ఎన్ని ఆటంకములు కలిగించిన కాల ప్రవాహాన్ననుసరించిన శాంతి ధర్మ "ఇస్లామ్" ప్రచార ప్రవాహాన్ని ఆపలేరు.

ఓయీ అల్లాః సర్వేశ్వరుడా ! నీప్రియుడగు శ్రీ కల్కియవతారుడైన మొహమ్మద్ గారి విషయములను నీభక్తులైన భారతీయులకు ఈ గ్రంథముద్వారగా వివరించినాను. నీవు శ్రీమొహమ్మదుగారిని విశ్వశించునందులకు వారిని ప్రేరేపించుము.

ఆమీన్ !–సుమ్ ఆమీన్!!

తథాస్తు!-తథాస్తు!!

ఓయీ ముస్లిమ్ పూజ్యులారా ! మన శాంతిమూర్తియైన శ్రీ మొహమ్మద్ గారి విషయములను మన హిందూ మిత్రులకు ప్రచారము ముమ్మరముగా కొనసాగించుటకు ఆర్థికంగా సాయపడి, మన గురుభక్తిని ప్రదర్శించుదము.

'నారయెతక్ బీర్' అనగా అల్లాసర్వేశ్వరుని పేరును ఉచ్చరించండి అని అర్థము.

'అల్లాహు అక్ బర్'

అనగా సర్వమానవులకు అల్లాసర్వేశ్వరు డొక్కడే సర్వాధికారి.

'నారయతక్ బీర్ - అల్లాహుఅక్ బర్'

"ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః"

అనగా ఓయీ మొహమ్మదు ! నీపై సలాము - సలాము సలాము యుండుగాక అని దీని నిజమైన అర్థము.



## గ్రంథకర్తయొక్క సంక్షిప్త జీవిత చరిత్రము

నేను మైసూరు దేశం, కోలారు డిస్ట్రిక్టు చిన్నబళ్ళాపుర వాసస్థుడను తండ్రిపేరు జనాబ్ మొహమ్మదు ఖాశింసాహెబుగారు. మాతపేరు జనాబా అమినాబి నేను ఇంటర్ మీడియట్ వరకు విద్యాభ్యాసముజేసి, మైసూరుదేశములో 11 సం॥లు ఫారెస్టు ఆఫీసరుగా పనిచేసినాను. ఇప్పుడు నావయస్సు 46 సం॥లు తదుపరి జగత్ గురు

ఆశ్రమము, ఆసఫ్‌నగర్ (హైదరాబాద్ దక్కన్) చేరుకున్నాను. సర్వ ధర్మ ప్రచారముకొరకు పాటుపడుచున్నాడను. ఆశ్రమములో నాకొక ఇల్లుయున్నది. భార్యబిడ్డలున్నారు.

శ్రీ వీరభోగవసంతరాయలు శ్రీ మొహమ్మదుగారి శరణులుగా వచ్చినారు. వీరి శిష్యుడనై సర్వధర్మ ప్రచారము కొరకై దీక్ష పొందినాను. సర్వధర్మప్రచారం 17 సం॥ల నుండి చేయుచున్నాను. కన్నడము, ఇంగ్లీషు, తెలుగు, హిందీ, సంస్కృతము, ఉరుదూ, అరబ్బీ భాషలను అవసరమైనంతగా నేర్చియున్నాను. ఇస్లామ్‌హిందూ శాస్త్రాలను గురువుద్వారగా అవసరమైనంత జ్ఞానాన్ని సంపాదించుకున్నాను. అల్లాః సర్వేశ్వరుడు నాకు ధర్మకార్యాన్ని నెరవేర్చుటందుకయి కొందరి ఆత్మిక శక్తులను ప్రసాదించారు. వారి అంశముల శక్తులు నాద్వారగా ధర్మకార్యాన్ని నెరవేర్చుచున్నవి.

—* ఆ అంశములివి *—

1. శ్రీ పండిత దివాకర్
2. శ్రీ వర్ధమాన మహావీర్
3. శ్రీ హనుమంతుడు
4. శ్రీమత్ శంకరాచార్యులు
5. శ్రీభక్తపోతన మహాకవి
6. శ్రీరామకృష్ణ పరమహంస
7. శ్రీ చిరంచీవుడు

17 సం॥లనుండి మైసూర్, మదరాసు, ఆంధ్ర, ఓఢ్ర, బెంగాల్, బీహార్ ప్రాంత్యములలో ధర్మప్రచారనిమిత్తం పర్యటించాను. ఈ ప్రాంత్యాలలో అనేక పండితులు నన్నెరుగుదురు.

ఈ గ్రంథము వ్రాయుటలో నాకు సహకరించిన నంద్యాల పట్టణపు టీచర్ సయ్యద్ అబ్దుల్లాసాహెబ్ గారి కుమారుడు సయ్యద్ ఇస్మాయిల్‌కు అల్లా సర్వేశ్వరుడు తగిన పుణ్యము ప్రసాదించుగాక.

(ఇట్లు గ్రంథ రచయిత)
2—5—1956

# శ్రీ జగద్గురు ఆశ్రమము యొక్క చరిత్రము,

1. సంఘ (founder) జనకుడు:-

శ్రీ హాజ్రత్ మౌలానా సిద్దీక్ దీన్‌దార్ చన్నబసవేశ్వర్ సాహెబ్ గారు, (శ్రీ వీరభోగవసంతరాయులు) వీరిపై అల్లా: సర్వేశ్వరుని ప్రసన్నత యుండుగాక

అల్లా: సర్వేశ్వరుని ఆదేశాన్ను పరించి, సర్వధర్మ సమ్మేళనమగు ధర్మసంస్థాపనకై. తాను నియుబడినానని, 1924 గో ఇస్వి, ఫిబ్రవరి మాసం 7 వ తేదీన, కన్నడ ప్రాంతము గదగ్ పట్టణములో, వీరు ప్రకటించారు కాబట్టి సంస్థాపనసంవత్సరము - 7-2-1924,

2 General Secretary జనరల్ సెక్రెటరి:-

శ్రీ మౌలానా మౌల్వి గాజీ-మహమూదుల్-ఖురేషీ సాహెబ్ గారు (శ్రీ వీరభద్రావతారం)

3. Secretary సెక్రెటరి:-

శ్రీ మౌలానా మౌల్వి సైయ్యద్ రసూల్ సాహెబ్ గారు. (శ్రీ కేశవావతారం)

ఈ సంఘములో 2,00,000 మంది సభ్యులున్నారు. యాకత్పురశ దేశంలో యుండే ముఖ్య భాషలలో ప్రచారము చేయు 300 మంది ప్రచారకులున్నారు సంఘ జనకుని ప్రముఖ శిష్యులలో పురాతన 63 (Promissed-missionaries of Peace) ప్రచారకులున్నారు. ఆశ్రమములో 150 గృహాలు ఉన్నవి

## సంఘము యొక్క ముఖ్య ఆశయాలు

(Aims and objections of the mission)

1. ఇది కేవలము ఆత్మిక సంఘము (A Spiritual body) ప్రపంచములో సర్వశక్తులచేత శాంతి స్థాపించుట.
2. అల్లా: సర్వేశ్వరుని ఏకత్వమును గురించి ప్రచారము సాగించుట
3. ప్రతియొక్క అవతార పురుషుని గౌరవ ప్రతిష్ఠాల్ని స్థాపించుట
4. ప్రతి యవతార పురుషుని పవిత్ర గ్రంథమును విశ్వసించుటయే గాక. దానిలోయుండే సత్యాన్ని బహిరంగ పరచుట.

